


# నవల, కథ, కవితల పోటీ

సిపిఎం 21వ అఖిలభారత మహాసభల సందర్భంగా ఉత్తమ సాహిత్యాన్ని ప్రోత్సహించేందుకై నవలలు కథలు కవితల పోటీ నిర్వహించాలని ఆహ్వానసంఘం నిర్ణయించింది. ప్రజా శ్రేయస్సు సామాజిక చైతన్యం కోరే రచయితలు కవులూ ఈ పోటీలలో పాల్గొని ఉత్తేజకరమైన రచనలు పంపి ఈ ప్రయత్నం జయప్రదం చేయాలని కోరుతున్నాము.

*నవల: ప్రథమ బహుమతి రూ.30,000/-, ద్వితీయ బహుమతి రూ.20,000/-, తృతీయ బహుమతి రూ.10,000/-*
*కథ: ప్రథమ బహుమతి రూ.10,000/-, ద్వితీయ బహుమతి రూ.5000/-, తృతీయ బహుమతి రూ.3000/-*
*కవిత: ప్రథమ బహుమతి రూ.3000/-, ద్వితీయ బహుమతి రూ.2000/-, తృతీయ బహుమతి రూ.1000/-*

నిబంధనలు/సూచనలు: ◆ కథకు సంబంధించి ఎ4 సైజు కాగితంపై చేతిరాతలో 8 పేజీలు ఉండాలి. డి.టి.పి. 15 సైజు ఫాంట్‌లో ఎ4 సైజులో 5 పేజీలకు మించకూడదు. ◆ మరీ సుదీర్ఘ కవితలు పంపనవసరం లేదు. ◆ నవల ఎ4 సైజు కాగితంపై చేతిరాతలో 250 పేజీలు ఉండవచ్చు. డి.టి.పి. అయితే 15 సైజు ఫాంట్‌లో ఎ4సైజులో 150 పేజీలకు మించకూడదు. ◆ ఇటీవలి ప్రపంచీకరణ విధానాల నేపథ్యంలో ప్రజల జీవితాలలో వస్తున్న మార్పులకు సంబంధించిన అంశాల్ని ఇతివృత్తంగా స్వీకరించవచ్చు. ఇతివృత్తంతో పాటు రచనా శిల్పానికి అధిక ప్రాధాన్యత ఉంటుంది. ◆ అచ్చయినవి, అనుకరణలు, అనువాదాలు పోటీకి అనర్హం. ఆ మేరకు హామీపత్రం రాయాలి. ◆ ఉత్తేజకరమైన పోరాట ఘట్టాలు, జీవితాలు కూడా నవలీకరించవచ్చు. కాని సమకాలీన ప్రపంచం ప్రస్ఫుటంగా ప్రతిబింబించాలి. ◆ గ్రామీణ జీవితం, మహిళలు, అణగారిన తరగతుల గురించి సజీవ చిత్రణలకు స్వాగతం. సామాజిక సమస్యలు, నూతన సమస్యలను కూడా ఇతివృత్తాలుగా తీసుకోవచ్చు. ◆ రచనలపై రచయిత, రచయిత్రులు తమ పేర్లు రాయకూడదు. హామీ పత్రంలో మాత్రమే పేరు, చిరునామా, ఫోన్ నెంబరు, ఇమెయిల్ వివరాలు రాయాలి. ◆ రచనలను కవరుపై **నవల, కథ, కవితల పోటీకి** అని రాసి **'మహాసభల ఆహ్వాన సంఘం, ప్లాట్ నెం. 21/1, యం.హెచ్. భవన్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, అజామాబాద్ ఇండస్ట్రియల్ ఏరియా, హైదరాబాద్- 500 020** చిరునామాకు పంపించాలి. ◆ ఈమెయిల్ **psbhap@gmail.com** ద్వారా కూడా పంపించవచ్చు. ◆ డి.టి.పి.చేసిన వాటిని పిడిఎఫ్, ఓపెన్ ఫైల్ రెండూ పంపించాలి. ◆. ఫలితాలకు సంబంధించి న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం. ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. ◆ రచనలు చేరవలసిన చివరి తేది: మార్చి 10. ◆ గెలుపొందిన నవలలు ప్రచురించడం జరుగుతుంది. ◆ పోటీకి అందిన కథలు, కవితలలో గెలుపొందిన వాటితో పాటు, సాధారణ ప్రచురణకు ఎంపిక చేసిన వాటితో కథ, కవితా సంకలనాలను ప్రచురించడం జరుగుతుంది. ◆ బహుమతి పొందిన కథలు, కవితలను ప్రస్థానం, ప్రజాశక్తి దినపత్రిక ఆదివారం సంచికలలో ప్రచురించడం జరుగుతుంది. ◆ విశాఖపట్నంలో ఏప్రిల్ 14 నుండి 19 వరకు జరిగే మహాసభల సాహిత్య వేదికపై బహుమతులు అందజేయడం జరుగుతుంది. ఇతర వివరాలకు 9490099059 ద్వారా సంప్రదించవచ్చును.

**- మహాసభల ఆహ్వాన సంఘం**

PRSVMO2A155

సాహిత్య
ప్రస్థానం
జనవరి 2015

సంపుటి : 14 సంచిక : 1

# కొత్త ఏడాది

2014 ముగిసి 2015 వచ్చేసింది. రాజకీయ ఆర్థిక సామాజిక సాంస్కృతిక రంగాల్లోనే గాక భౌగోళికంగా చారిత్రకంగా కూడా తెలుగు వారికి కొత్త పరిస్థితి తీసుకొచ్చింది. తెలంగాణ,ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రాలు ఏర్పడ్డాయి. దాంతోపాటుగానే అన్ని రంగాల్లోనూ అనివార్యంగా అనేక నూతన పరిణామాలు సంభవిస్తున్నాయి. వాటిని సజావుగా నిర్వహించుకోవడం, ఉభయ రాష్ట్రాల అభివృద్ధికి చర్యలు తీసుకోవడం ఇప్పుడు జరగాల్సిన మొదటి పని. గతానికి సంబంధించిన విచారాలు వివాదాలు ఇప్పుడు అప్రస్తుతమే కాదు, అవాంఛనీయం కూడా. తెలుగు వారంతా చూడవలసింది ముందుకే. అందుకే తెలుగు రాష్ట్రాల ప్రజలకూ ప్రభుత్వాలకూ నూతన సంవత్సర శుభాకాంక్షలు. సాహిత్య ప్రస్థానం పాఠకులకు రచయితలకూ ప్రకటన కర్తలకూ ప్రత్యేకాభినందనలు. నూతన సంవత్సరంలో ప్రస్థానం వినూత్న రీతులలో రచయితలనూ పాఠకులనూ అలరించేందుకు ప్రయత్నిస్తుందని ఈ సందర్భంగా తెలియజేస్తున్నాం.

విభజన ప్రభావం ఏ రంగంలో ఎలా వున్నా , తెలంగాణ , నవ్యాంధ్ర ప్రదేశ్ తేడాలున్నా ఇక ముందు కూడా రెండు రాష్ట్రాల్లోనూ వచ్చేది తెలుగు సాహిత్యమే అవుతుంది. హిందీ రాష్ట్రాలు అన్ని వున్నా మనం హిందీ సాహిత్యం అంటాము గాని ఉత్తర ప్రదేశ్ సాహిత్యం,బీహార్ సాహిత్యం అనం. తెలుగు వారికి మాత్రమే ఈ తేడాలు తెలుస్తాయి గాని బయటనుంచి చూసేవారంతా తెలుగు సాహిత్యంగానే పరిగణిస్తారు. కనుకనే ఉభయ రాష్ట్రాల ప్రభుత్వాలూ భాషా సాహిత్య సంస్కృతుల వికాసానికి ఇతోధికంగా సహకరించవలసి వుంటుంది. నూతన రాష్ట్రాల్లో ప్రజల సమస్యలను ప్రతిధ్వనించడంలోనూ, ప్రజాస్వామ్య లౌకిక విలువలను కాపాడుకోవడంలోనూ సాహిత్య కారులు ముందుంటారని ఆశించాలి. మారిన నేపథ్యానికి తగినట్టు మరింత పదునైన అక్షర సృజన జరగాలి. సాంస్కృతిక కాలుష్యాన్ని అడ్డుకుని ప్రజా సంస్కృతిని నిర్మించుకోవాలి.

గత లోక్‌సభ ఎన్నికల తర్వాత కేంద్రంలో మతతత్వ వివాదాలు తరచూ ముందుకు రావడం ఆందోళన కలిగిస్తుంది. ఆర్థిక రంగంలోనూ దేశ స్వావలంబనను ప్రజా ప్రయోజనాలను దెబ్బతీసే పలు నిర్ణయాలు జరుగుతున్నాయి. వీటిని నివారించలేకపోతే సామాన్యుల జీవితాలు దుర్భరమవుతాయి. ఉపాధి అవకాశాలు కుదించుకుపోయి ధరల భారం పెరుగుతుంది. రాబోయే ఏడాదిలో ఈ విధానాలను మార్చేందుకై జరిగే ఉద్యమాలలో రచయితలు ప్రజలకు అండగా నిలవాల్సి వుంటుంది. లౌకిక విలువలను రక్షించుకోవలసి వుంటుంది.

అంతర్జాతీయంగా అమెరికా ప్రభుత్వం క్యూబాతో అయిదు దశాబ్దాల తర్వాత దౌత్య సంబంధాలు ఏర్పాటు చేసుకోవడం ప్రపంచ వ్యాపితంగా ప్రగతిశీల శక్తులకూ వర్ధమాన దేశాలకూ ఒక విజయమని చెప్పాలి. ప్రపంచీకరణ యుగంలోనూ గట్టిగా నిలబడితేనే దేశాల ఆత్మగౌరవం గుర్తించబడుతుందని చెప్పే ఉదాహరణ ఇది. వచ్చే ఏడాదిలోనైనా భారత దేశం ఆ విధమైన స్వీయ గౌరవం సార్వభౌమత్వం కాపాడుకుంటుందని ఆశిస్తూ కొత్త సంవత్సరాన్ని ఆహ్వానిద్దాం.

బొమ్మలు : తుంబలి శివాజి, జె.వెంకటేష్, భాస్కర్

## ఈ సంచికలో ...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్‌భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్
ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర,
హైదరాబాద్ - 500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040ñ27635136,
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

# రండి బాబూ రండి.. మా భూమిలిచ్చేస్తాం

- డా॥ ఎస్. ఈశ్వరరెడ్డి
9490192228

తెలుగు నేలను కేకు ముక్కలా
కోసిపారేశాక
శిలాశకలంలా నిలబడ్డ ఆంధ్రప్రదేశ్
రాజధాని కోసం మోరెత్తి చూస్తోంది



రాజధాని కమిటీ సూచనల పత్రాల్ని
'కృష్ణ'లో కలిపి
పెట్టుబడిదారుల అవసరాలకమిటీ
రాజధాని చిత్రపటాలను గీయడం
మొదలెట్టింది
డబ్బులున్నోళకు దఖలు చేయడానికి
రాజధానిని సిద్ధం చేస్తోంది.
ఖాళీ భూములున్న దొనకొండకు కిరీటం పెడితే
నాయక అనకొండలకు ఏం మిగులుతుంది?
భూసేకరణ పేరుతో ఘనంగా ఖర్చుపెట్టకుంటే
మంత్రిగణాల వాటాలు బరువెలా ఎక్కుతాయి?
కార్పొరేట్లకు నెత్తుటి కార్పెట్లెయ్యకపోతే
ఎన్నికల సంతలో కరెన్సీ కుప్పలు ఎందుకు పోస్తారు?
గాలి వాగ్దానాలకు - కరపత్ర హామీలకు
ఓట్ల పండ్లు రాలవని
నోట్ల రాళ్ళతో కొట్టిన నాయక కుబేరులకు
డబ్బు ఆకలి తీరేదెలా? కోట్ల గాదులు నిండేదెలా?
వ్యక్తిగత లాభాలు పండించలేని
ప్రభుత్వ భూముల్లో రాజధాని మొలిస్తే
పార్టీల రంగుల్ని చర్మాలుగా కప్పుకొని తిరిగే
అవకాశవాద సుఖపురుషులు ఏమైపోవాలి?
పరంపరగా వచ్చిపడే ఎన్నికల జాతర్లకు
డబ్బుల బస్తాలు ఎలా వస్తాయ్?
బంజరు భూముల్లో భవంతులు వెలిస్తే
రియల్ 'భూ'కాసురులు ఎక్కడ చావాలి?
రండి బాబూ! రండి.. మా భూములిచ్చేస్తాం
ముక్కారు పంటలు పండే భూములిచ్చేస్తాం
మా కళ్ళకు సింగపూర్ అద్దాలు తగిలించి
మా చేతిలో జపాన్ చిప్పల్ని పెట్టండి చాలు
హాయిగా అడుక్కొని బతికేస్తాం
అన్నం కుండను పగలగొట్టేశాక
ఆకలి కడుపులు ఎలా మాడితేనేం?
మట్టి పిసుక్కోవడం తప్ప మార్కెట్ తెలియని
బక్క రైతుల పక్కటెముకలు నుజ్జయి పోతేనేం?
వ్యవసాయ కూలీల గూళ్ళు చెదిరిపోతేనేం?
పంట చేనును ప్రాణంగా చూసుకొనే
పాతకాలపు మనుషుల గుండెలు పగిలితేనేం?
రండి బాబూ రండి! మా భూములిచ్చేస్తాం!
అర్థబలం- అంగబలం 'నాయ'కీయం అయ్యాక
గుత్తేదార్లు శాసన కర్తలయ్యాక
ప్రజా బడాయి స్వామ్యం మీ పెరటి గోడ అయ్యాక
మేం కాదన్నా.. మీరు ఆగరు గదా బాబూ! అందుకే
రండి బాబూ రండి.. మా భూములిచ్చేస్తాం
మా బతుకులిచ్చేస్తాం.

## డిసెంబర్ నెల పురస్కారాలు



**అంకురం**
కథకు: రూ.700/-
రచయిత : **శాంతిశ్రీ**

**దూరమైన అక్షరం**
కవితకు : రూ .500/-
రచయిత : **పుష్యమి సాగర్**



సినీ రచయిత జనార్ధన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

**వ్యాసం :**
**అమెరికా తెలుగు కథకు 50 ఏళ్ళు**
రచయిత : డా॥ తన్నీరు కళ్యాణ్ కుమార్
ఈ రచయితకు 'కర్లపాలెం రుక్మిణమ్మ స్మారక పురస్కారం' రూ. 500/- అందజేయబడుతుంది.

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు.
సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని
ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.
- ఎడిటర్




# చీనా

- సమ్మెట ఉమాదేవి
*9849406722*

**"అన్నా నువ్వు నీ దోస్తులతో అంటవు సూదు.. పెండ్లి చేసుకోవాలంటే భూమి జాగా బంగారం బలగం వుండగానే సరిపోదు.. ఈమె లేక పోతే నేను బతకలేను అనిపించాలని.. నాకు సుత దారును జూస్తే అట్లనే అనిపిస్తున్నది. మీ అందరిని ఇడిసి అంత దూరంబోవుడు కష్టమే అయినా.. అతన్నే మనువాడాలనున్నది." సిగ్గు పడుతూనే స్పష్టంగా చెప్పింది.**

తన ఏకైక చెల్లెలు సంతూ అంటే చీనాకు ఆరో ప్రాణం. ఆమె ఏది కోరితే అది తెచ్చి పెట్టేవాడు. మా చెల్లె మా చెల్లె అంటూ ఆమెను తనతో వెంట వెంట తిప్పుకునేవాడు. తమకు దూరపు చుట్టమయిన దారు తరుచూ ఏదో ఒక పనిమీద తమ ఊరికి వచ్చేవాడు. చూపు మాట కలిసిన ఆ జంట ఒకరికొకరు ఇష్టపడ్డారు. నిజంగా వాజేడు తమకు చాలా దూరమయినా, దారును ఇష్టపడిందని తల్లిదండ్రులను ఒప్పించి మరీ కోరుకున్న వ్యక్తితోనే పెళ్ళి జరిపించాడు. దారు సంతూ ఇద్దరూ చూడ ముచ్చటైన జంట. సంతూ చాలా అణకువగా వుంటూ ఇంటిల్లిపాదిని తన వాళ్ళను చేసుకున్నది. పక్క ఊరిలో అన్న వ్యవసాయం అంతంత మాత్రంగా వుంది. చెల్లెలి పెళ్ళికి చేసిన అప్పు తీర్చడం కోసం అన్నతోపాటు తానూ చాలా కష్ట పడాల్సి వచ్చింది. ఈ లోగా సంతు ముగ్గురు పిల్లల తల్లి కూడా అయిపోయింది. మరో రెండేళ్ళు గడిచాయో లేదా చీనాకు పెళ్ళి చేద్దాం అనుకునే సమయంలో చీనా తండ్రి చనిపోయాడు.

"ఏందన్నా నువ్వు పెళ్ళి చేసుకోవు ..?"అని అడిగేది. పెళ్ళి చేసుకోవాలంటే.. భూమి జాగా, బంగారం బలగం వుండగానే సరిపోదు .. ఒకమ్మాయిని చూడగానే ఈమె లేకుండా నేను బతకలేను అనిపించాలె సంతూ .. అందుకేగదా నీకు గూడా నీ మనసుకు నచ్చిన వాడికిచ్చి పెళ్ళి చేసింది.." నవ్వుతూ అనేవాడు. కొన్నాళ్లకు కోక్యా తండాలో ఓ పెళ్ళి లో తన్యాను చూస్తే అట్లాగే అనిపించింది చీనాకు. అనుకున్నట్లుగానే వాళ్ల పెద్ద వాళ్ల ను ఒప్పించి పెళ్ళికూడా చేసుకున్నాడు. కానీ ఇప్పుడు ఆమె లేకుండానే బతుకుతున్నాడు..

ఎందుకలా అని ప్రశ్న ఉదయించిన వాళ్ళంతా ఇలా చీనా గతంలోకి ఓ సారి తొంగి చూడాల్సిందే..

"ఏందమ్మా పెళ్ళంటే పూలన్నీ మీరు పెట్టుకోడమేనా జరంత మా చెల్లెలికేమన్నా వుంచుతరా లేదా.." వంకీల జుత్తు చురుకైన కళ్ళతో వున్న చీనాను ఓరగా చూసింది తన్యా..

"ఎవరీ పిల్లగాడు.. మూడురోజులనుండి ఎక్కడ చూసినా ఇతనే కనపడుతున్నాడు. అందరినీ నవ్విస్తున్నాడు వరుసలు కలుపుతున్నాడు.." అన్నది తన్యా. గుస గుసగా అడగడం చీనా చెవిన పడి ముసి ముసి నవ్వులు నవ్వుకున్నాడు.."

"పార్వతికి అన్నయితడట..మస్తు షాను జేస్తున్నడు.." గొణిగింది రోష్ని. మాటలే కాదు ముగ్గురు మనుష్యులు చేసే పనిని ఒక్క చేత్తో చేస్తున్న చీనా చాలా మంది అడపిల్లలను ఆకట్టుకున్నాడు. .

ఏ పనిచేస్తున్నా ఆ నవ్వు మాయలేదు. ఎక్కడా అలసట కనపడలేదు. పెళ్ళి ముగిసే సరికి ఎవరి నోట విన్నా చీనా మాటే.. ఇక అప్పగింతల సమయం వచ్చింది. పెళ్ళికూతురు తన చిన్ననాటినుండీ ఎక్కడెక్కడి విషయాలో చెపుతూ తల్లిని పట్టుకుని ఏడుస్తుంటే.. తన్యా దు:ఖం తట్టుకోలేక అక్కడ వుండలేక బయటకు వచ్చేసింది. తురాయి పూలచెట్టుకింద నిలబడి ఎవరూ చూడడం లేదనుకుని దోసిట్లో ముఖాన్ని దాచుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది. కాస్సేపటికి ఎవరో తన పక్కన నిలబడ్డట్టనిపించి తల ఎత్తి చూసింది. ఎదురుగా చీనా..



"నీకు మీ దోస్త్ అంటే అంతిష్టమా..? నువ్వు అట్లా ఏడవకు నువ్వా మీ దోస్తు విడిపోకుండా వుండే వుపాయం చెప్తకదా." గొంతు తగ్గించి అన్నాడు. ఏడవడం ఆపేసి కళ్ళు విప్పార్చుకుని చూసింది.

"అంతా అవద్దాలే." కూర్చుని మోకాళ్ళల్లో తల పెట్టుకుని మళ్ళీ ఏడవడం మొదలు పెట్టింది. "సరె తియి నన్ను నమ్ముతల్లేవు గదా.. ఇప్పటికి పార్వతిని అత్తగారింటికి ..అదే మా ఊరుకి పోనియి.. వారం దినాలకల్లా ఏమయితదో చూద్దువుగాని. అంటూ వెళ్లిపోయాడు. నాలుగు రోజులు గడిచాయో లేదో అత్తారింటికి కొత్తల్లుడితో పాటు చీనా కూడా దిగాడు.

పార్వతి వచ్చిందన్న సంతోషంతో తన్యా అటు పరుగు పెట్టింది. మూడు గంటలు ముచ్చట్లు పెట్టకున్నా కదలని పార్వతి తన్యాలను చూసి ..పెద్దలు జర పెండ్లికొడుకును కూడా అరుసుకోండ్రి పావం ఒక్కడు కూసున్నడు అన్నారు. మొహమాటంగా నవ్వుతూ తప్పనిసరిగా అక్కడినుండి కదిలింది. తన్యా ఇంటికి వచ్చేసరికి.. వాకిట్లో చీనా నలుగురు పెద్దలు మధ్య కూర్చుని మాట్లాడుతున్నాడు.

తన్యాకు ఆ పెళ్ళి మాటలు ఎవరిగురించో అర్ధం కాలేదు. "జర చాయి బెట్టు బిడ్డా.." అని తండ్రి అనగానే లోనికి వెళ్ళిపోయింది. తల్లిని అడుగుదామన్నా ఆమె కూడా లోపలికి రాలేదు. వాళ్ళతోపాటే కూర్చున్నది.

" పెద్దలు సంపాదించిన దాని మీద నాకు ఆశలేదు కాకా. కాలు రెక్కలు సక్కంగున్నంత కాలం కష్టం జేసుకుని బతికే దమ్మున్నది. పిల్లనిస్తే నెత్తిమీద బెట్టుకుని చూసుకునే ప్రేమున్నది. గంత వరకైతే జెప్త. పెద్దలు ఇగ మీరే సోంచాయించుండ్రి." చెప్పి వెళ్ళిపోయాడు చీనా

"పిల్లగాడు జబర్దస్తుగున్నడు. ఇస్లావతోల్ల పిల్లగాడు. నిలబడి పిల్లనియ్యమని అడిగే దమ్మునోడు. నా గిట్ల ఈడైన కూతురుండింటే అస్సల్కే వదిలిపెట్ట. ధైర్నం జెయ్యి మోతీలాల్.." పిల్ల సుఖపడ్తది రాజూనాయక్! అన్నాడు. ఉలిక్కిపడింది. తన్యా "అంటే ఈ మాటలన్నీ నా పెళ్ళి గురించా..!" ఒక్కసారిగా సంతోషం ముప్పిరి గొన్నది. "అంటే చీనాకు నేనంటే ఇంత ఇష్టమైందా..! నన్ను పెండ్లి చేసుకుంటానంటున్నడా..!"సంబరపడిపోయింది అంతలోనే "ఆయనకు నచ్చితే నాకు నచ్చాడో లేడో అడిగే పనిలేదా ఎంత ధైర్నం ఈ చీనాకు'' పౌరుషపడింది. ఆ సాయంత్రం పార్వతి దగ్గరకు వెళ్తుంటే దారిలో ఎదురు పడ్డ చీనాను చూసి కావాలనే ముఖం తిప్పుకున్నది.

"ఇదిగో తన్యా నీతో మాట్లాడాలె..పార్వతి వాల్లింటెనక రాగిచెట్టుదగ్గరకు రా.." అన్నాడు.

"ఆ సాలు తియ్యి. నాతో ఏం మాట్లాడుతవ్ అంతాపెద్దోళ్ళతో మాట్లాడుకుంటున్నవుగదా.." విసురుగా వెళ్ళబోయింది.

"ఇగ్గో నీతో మాట్లాడనీకి చెట్టుకిందకు రా..లేకుంటే ఎవ్వల్ల మాటతో పనిలేదు నిన్ను ఎత్తుకపోత.. తెల్సిందా.. నవ్వుతూ బెదిరించాడు. గుండె ఒక్కసారిగా ఆగిపోయి మళ్ళా కొట్టకోనారంభించింది. ఎందుకో నిన్ను జేసుకునేటందుకే ఈ పెండ్లికి వచ్చినా..

అనిపిస్తున్నది నువ్వు కండ్ల బడంగనే.. నువ్వేనాకు జోడి అని నా మనసు జెప్తున్నది.నీకు గూడ నచ్చితే పెండ్లి జేసుకుందం. కాదు నేను నీకు నచ్చకుంటే నచ్చలేదు అని జెప్పెసెయ్యి.. మా ఊరు మర్లిపోతా అన్నాడు. ఆ చివరి వాక్యం చెప్పినప్పుడు కంపించిన అతని గొంతు విని ఆమె పోట్లాడం మానేసి వెళ్లి అతని చెయ్యి గట్టిగా పట్టుకున్నది. అంతే అతను కదలి కెరటంలా ఎగసిపడ్డాడు.. వున్నంతలో ఊరంతా సందడిచేసి ఆమెను పెళ్ళదాడు.. అది మొదలు ఆమె

చీనా నాకు పెళ్ళంటే చాలా భయమేసేది. మా నాయిన దినాం తాగి మస్తు లొల్లిబెడ్తడు. మా అక్క పెనిమిటి గంతే మస్తు

తాగి ఇల్లు నరకం చేస్తున్నడు. ఈ మొగోళ్ళంతా గింతే గదా మా అడోళ్లను చెరలు బెట్టనీకే పుట్టిన్రు. అనుకునే దాన్ని. పండు వెన్నెల్లో వేప చెట్టుకింద నులక మంచం మీద కూర్చుని అతని గుండెలపైనా గుబురువేసిన జుత్తుతో తన సన్నని వేళ్ళతో ఆడుకుంటూ అన్నది.

ఏం జేస్తం తన్యా.. ఎంత కాయ కష్టం జేసినా వచ్చే పైసలు సాలవాయె.. ఇంటికస్తుంటే చేసిన బాకిలు కర్సులన్ని మనసుల మెదులుతయి. పెయ్యి, మనసు అలిసిపోయి అన్నీ మరిసిపోయేందుకు జరంత తాగదమని బోయి పీకల దాక తాగుతరు. ఇంట్ల ఆడోళ్ళతో గిట్ట లొల్లిబెట్టుకుంట.. మొదాలు వీల్లె లొల్లిబెడతరు.. ఏం జేసుడు గరీబోని బతుకు కనా కష్టమైపోతున్నది. చీనా మాటలతో త్రండంటే జాలి కలిగింది..

'ఏమో మా అయ్య తాగుడు జెయ్యబట్టి ఆల్ల కిరికిరిలతోనే సరిపోయెటవి....మేము నలుగురక్క చెల్లెలమేమొ మాకు చిన్నప్పటి సంది గింత మందిమి పిల్లలయ్యేపటికి మాకు ఏ కోరికలు తీరనే లేదు. మేముగూడా చేనుకు బోవుడు లేదంటే మా అమ్మ చేనుకు బోయి వచ్చేవరకు చెల్లను బట్టుకునుడు వంటలు జుసుడు గొడ్లకు మేతేసుడు. అంట్లు బట్టలు గిదే ప్రపంచం.. చాలా అసంత్రుప్తిగా అన్నది..



“గంత ఘనం కోరికలు ఏమున్నయేం నీకు.. ”అడిగాడు.

“ఎన్నయిన వుంటయి. అందరి పిల్లలెక్క ఒక ముద్దా ముచ్చటన్నా..చిన్న కోరికల సుత దీరలేదు చెప్పితే నువ్వు నగుతవు గూడ”

“ఏం నవ్వను తన్యా నువ్వు నా పాణం రా నీకు ఏమి కోరికలున్నయె చెప్పాల్సిందే..నాకు గాకా ఎవళ్ళకు జెప్తవు చెప్పు తన వడిలో పాపను చేసుకున్న తన్యా పట్టు పట్టాడు..

సీన్మకు బోవాలె.. మంచిగా ఇల్లంతా అలుక్కుని మంచి బట్టలు గట్టుకోని..పూజలు చేసుకుని మేడారం జాతరకు బోవాలె.. ఆడ రంగు రంగు బొట్టు బిల్లలు గాజులు చెంప పిన్నులు గొలుసులు గొనుక్కోవాలె..గారాబంగా ఒక్కో కోరికా ఆమె చెబుతుంటే..తనను

పెన వేసిన ఆమె చెతితో ఆడుకుంటూ వేలి వేలికో ముద్ద పెడుతూ మురిపంగా వింటూ..ఓ గింతేనా ఇవ్వన్నీ దీర్వను. నేనున్నగదా

అన్నాడు.అనడమే కాదు రెండురోజుల్లో తన్యా తయారుగా సీన్మకు బోదం అన్నాడు. కదలకుండా నసుగుతూ నిలబడ్డ తన్యా వంక ఆశ్చర్యంగా చూసాడు.

“పగటి ఆటకు కాదు.. మొదటి ఆటకు బోవాల..”అన్నది.. “ఏంది తన్యా మనం బస్సుదిగినంక మూడు మైళ్ళు నడవాలె అది మరిసినవా..

“అయినా సరే నువ్వున్నవు గదా నాకేం ” భయ్యం అన్నది. సరే అన్నాడు.. ఆమె సిగనిండా పూలమాలలు కొని పెట్టాడు. కోరుకముందే రకరకాల చిరుతిళ్ళు కొని పెట్టాడు ఆమె అబ్బురంగా సినిమా చూస్తుంటే తాను సంబరంగా ఆమెను చూసుకున్నాడు.. ఆనందంగా అతని బుజం పైవాలి నిద్దోరయింది. తన్యా గిప్పుడే నిద్ర బోతే మూడు మైళ్ళు ఎలా నడుస్తుంది అని కంగారు పడ్డాడు. చందూకి ఫోనుచేసి స్టేజి దగ్గరకు ఆటో తెమ్మని చెబ్దాంలే అనుకున్నాడు. అతని ఫోను కలవడంలేదు. అప్పటిదాకా కునుకు తీసిన తన్యా లేడి పిల్లలా గెంతుతూ నడవసాగింది. మధ్యలో అప్పుడే చూసిన ఆ సినిమా పాటలు .. పాడుతూ.. నవ్వుతూ కబుర్లు చెబుతూ వెన్నెల్లో తన్యా నడుస్తుంటే..

ఆ వని కి ఓ తెల్ల కలువ నడకలు నేర్చినడయాడినట్టుంది. ఆ కాలి మువ్వల సవ్వల్లు.. ఆ గాజుల గలగలలు మెట్టల చప్పుల్లు తన్యా.పెళ్ళి చేసుకుంటే మొగోని జీవితమే మారిపోతదని ఇందుకే అంటారు అనుకుంటా అనుకున్నాడు. అలుపు రాకుండా కాస్సేపు చెరువు కట్టమీద ఇద్దరు కూర్చున్నారు.

“తన్యా ఇన్ని దినాలు ఈ దారిలో ఎంతో దిరిగిన నాగురించి నేను ఏనాడు బయపడలే .. ఇప్పుడు నువ్వు ఈడ దిరుగుతుంటే ఏ పురుగు గుడతదె ఏ ఎలుగు వచ్చి నిన్ను భయపెడతదో అని భయమయితాంది..” అన్నాడు ఆమె భుజం చుట్టూ చేతుల వేసి దగ్గరకు పొదవుకుని నడిపించసాగాడు.

“నాకైతె అస్సల్కే భయమైతల్లే. అన్నిటికి నువ్వున్నవు కదా.. ”అన్నది దాదాపు అతన్ని పెనవేసుకుపోతూ నడుస్తూ.. అకస్మత్తుగా ఆమెను ఎత్తుకుని కాల్లు నొస్తున్నయా.. తాన్య అడిగాడు. మైకం కమ్మినట్లు సంతోషంతో అల్లుకుపోయింది. కొన్ని అడుగులు నడిచాకా వద్దు వద్దు నేను నడుస్తా. అయినంక నాకు చేతులు నొస్తున్నయి. కాళ్ళు గుంజుతున్నయి అంటే నేనమయి పోవాలె. గడుసుగా అంటూ అతని చేతుల్లోంచి దూకి చక చకా నడవసాగింది. ఒకరికొకరు చేయి కలిపి, అడుగులు కలిపి మారాము చేస్తూ.. నవ్వులు రువ్వుతూ.. ఆ వెన్నెల్లో అ యువ జంట అడవి తల్లి గారాల పంటలా చరించారు. తన్యా రెక్కలొచ్చిన పక్షిలా కాస్సేపు అతనికి దొరకకుండా పరుగులు తీసింది. మరి

కాస్సేపటికి దొరికిపోయి అతని చేతిలో గువ్వలా ఒదిగిపోయింది. అతని చెమటను కొంగుతో తుడిచింది. నుదుటన

ముద్దులు పెట్టింది. ఇంటికి చేరాక కంచంలో అన్నం కలిపి ముద్దలు తినిపించింది.

"తన్యా మరి మనకో బిడ్డ వద్దా ఆమె చెవిలో గుస గుసగా అడిగాడు .. వద్దు కొంత కాలం నాకు నీ బిడ్డగా బతకని అన్నది ఆమె కన్నుల్లో నీరు. "ఇదేంది తాన్య.."

"నిజం చీనా.. సంతోషం. ఏదినానికాదినం.. డబ్బాల గింజలు ముంతలో గంజి జూసుకునుడే.. పొద్దంతా పెయ్యి

అలిసేదాక కష్ట పడుడు పొద్దు బోయినంక అమ్మా నాయనలదో పక్కింటి కాక. మామా వాళ్ళదో కొట్లాట జూసుడు. గిదే దెలుసు నాకు. మంచి బువ్వకు.. మంచి బట్టకు ఎంత నోసుకున్నమో గాని.. మంచిగ బతకనీకి మాత్రం అస్సలు నోసుకోలేదని అనిపిస్తుండే. గడవని నాడు ఇంతమంది పిల్లలనెందుకు గనాలె అని మా అమ్మ మీద కోపం.. అమ్మతోని లొల్లి బెట్టుకుంటడని నాయనంటే కోపం.. తాగుడు బందు బెట్టని మగన్ని ఎందుకు ఇడిసి పెట్టి రాదని అక్క మీద కోపం.. వాళందరిని ఇడిసి పెట్టి వచ్చి నీ తానకచ్చినంకనే బతుకు ఇంత పావురం కలుగుతున్నది. ఇప్పుడే పిల్లలను కనాల్నని లేదు కొన్నిరోజులు గాని.."



"తన్యా మన చేతిల ఏమున్నది బగమంతుడేది రాస్తే అదే అయితది.. తియి. "ఆమెను బుజ్జగించాడు. వుండుండి ఆమె

వుత్తుత్తి అలుకలు పోతుండేది. అతను ఎన్నోరకాలుగా నవ్వించి ఆ అలుక తీర్చేవాడు. తనతో చేనుకు తీసుకెళ్ళేవాడు. నువ్వేమి పని చెయ్యొద్దు అక్కడ కూర్చోమనే వాడు. అయ్యో గిదేమి సుతారమే.. అని ఆడంగులు బుగ్గలు నొక్కుకునే వారు .. నా చెయ్యికి దెబ్బ తగిలింది అత్తా తాన్యా అన్నం దినిపిస్తదని తీస్కచ్చినా అనే వాడు .. అందరిముందు .. అన్నం కలిపి తినిపించాలంటే సిగ్గు పడుతుంటే.. అమ్మో.. అయ్యో అంటూ చెయ్యి పట్టుకుని చూపుతూ మెలికలు తిరిగే వాడు తన్యా కంగారు పడి తినిపిస్తుంటే గుంభనంగా నవ్వుకునేవాడు. తిన బెట్టమ్మా..

తినబెట్టు సాయంత్రం మీ ఆయనకు కాల్లనెప్పులస్తే ఎత్తుకొని ఇంటికి గొంచబో అని నవ్వుతూ వాళ్ల పనుల్లో పడేవారు మిగితావారు. అతను పని ముగించుకునే వరకు అతను చెట్టుకు కట్టిన ఊయల ఊగుతుండేది. "ఊగమ్మా ఊగు మారాణి జాతకం నీది "అని.. నవ్వేవారు. జాతరకు తీసుకెల్లి పుల్ల ఐసక్రిం తినిపించాడు. కోరుకున్నన్ని గాజులు బొట్టు బిల్లలు ఎమె కోరుకున్నవన్నీ కొనిచ్చాడు.

మనుష్యలన్నా బంధాలన్నా ప్రాణం పెట్టే తన చీనా తల్లో, చెల్లో, అక్కో వస్తే ఎంతో సంబరపడిపోయేవాడు. వున్నన్ని రోజులు వాళ్ళకు సకలం అమర్చి పెట్టే వాడు. తన అక్కా చెల్లెల్ల చిన్ననాటి ముచ్చట్లు కథలు కథలుగా చెప్పేవాడు. వారి పిల్లలను భుజానా మోసి ఉప్పెక్కించుకుని తిరగేవాడు.. వాల్లను చేలగట్టుకూ చెరువు కటకూ తిప్పేవాడు. అమ్మ చుట్టూ చుట్టూ తిరుగుతూ నా దగ్గరే వుండరాదమ్మా అంటూ అడిగేవాడు. మీ వదినకు ప్రాణం బాగలేదు బిడ్డా అన్నొక్కడు యవసాయం పనులు ఎట్ల జేసుకుంటడు."

అనేది.వాల్లను సాగనంపాక చిన్నబోయిన జీనాను తన వడి జేర్చుకునేది తన్యా.. ఇంతా మా లవు ప్రేమలు ఈడనే జూస్తున్న.. మిమ్ములను జూస్తుంటే నాకెంత మంచిగనిపిస్తున్నదో..అనేది.

ఇంకా మామూలు స్థితికి రాని చీనాను చూసి ఇగ్గో సూడు నీ బొమ్మ గీస్త.. అంటూ వేలి కొసతో అతని ముఖం చుట్టూ గీత గీసి, ఇవిచీనా కను బొమ్మలు.. ఇవి చెవులు.. ఇవి చెంపలు అంటూ గీస్తూ..గీస్తూ గుండెల మీద వేళ్ళు పాకించి చక్కలిగిలి పెట్టేది ఆమె అల్లరికి నవ్వేసే వాడు.. ఇదిగో అమ్మ ముద్ద.ఇగో ఇదొక్కట్తే ఇదిఅక్క ముద్ద ఇది చెల్లె ముద్ద అంటూ అన్నం తినిపించింది. "ఇప్పుడు కాదు గాని రేపు నేనొకటి అడుగుత చెయ్యాలె.." షరతు పెట్టింది. మర్నాడు ఏంది తన్యా అని అడిగితే సిగ్గుతో మెలికలు తిరిగింది. చాలా సేపు బతిమాలించుకున్నాక చెప్పింది.. "దినాం మా నాయన తాగొచ్చుడే గాని ఏనాడు మా ముద్దూ ముచ్చట జూడలే మా బతుకులు గూడా ముద్దకోసం తన్లాడే మా బతుకులల్ల వేరే ఆలోచన ఏమున్నది గాని..ఆపింది.

చీనా ఆమె భుజం చుట్టూ చెయ్యి వేసి చెప్పు తన్యా..

"నాకు ఉయ్యాల ఊగలనుందంటే ఇంటి కాడా చేనుకాడ ఉయ్యాల గట్టి ఊపినవు. చెప్త గాని.. నువ్వసలు నగొద్దు. నాకు నాకు.. గుర్రమెక్కాలనుంది. సిన్నప్పుడు ఆ ఆట నేనాడుకోలే.. చిన్నగా అన్నది తన్యా.. విస్మయాన్ని అదిమి పెట్టి.. తన్యా ముందు గుర్రంలా వంగాడు. సిగ్గుల మొగ్గవుతూనే తన్యా ముద్దుగా గుర్రమరోహించింది. చీనా ఇల్లంతా గుర్రంలా దోగాడుతూంటే.. తన్యా సంబరంగా అతని వీపెక్కి తిరిగింది. తనను అంత బాగా అర్థం చేసుకున్న మగని చూసి సంతోషంతో కిలా కిలా నవ్వింది. హే.. హే.. హే..అంటూ ఉత్సాహంగా కేరింతలు కొట్టింది. ఇంక చాలు లే చీనా.. అంటూ అకస్మాత్తు గా ఆపేసింది.. నేనేందో

పిచ్చిగ అడిగింది. గాని కాళ నొచ్చినయా.. అని అడిగింది. ఇంకెప్పుడూ అడగనులే.. అంది ముడుచుకుపోతూ..

హే ..అప్పుడే అయిపోయిందా..! నాకేమి కాల్లు నొయ్యలే.. నువ్వేం పరేషాన్‌గాకు.. అన్నాడు. అప్పటినుండి ఆమెను

ఎప్పుడు మంచి చేసుకోవాలంటే అప్పుడు ఆమె మొందు మోకరిల్లి నిలిచావాడు.. ఆమె మహారాణిలా ఎక్కి కూర్చోని గుర్రమాటాడేది..అలా ఆడుతూ పాడుతూ గడుపుతున్న ఆ జంట గురించి ఆ తండాల్లో కథలు కథలుగా చెప్పుకునేవారు..

ఎర్రటి ఎండలో చేనులో చెట్టుకు కట్టిన తాడు ఉయ్యాలపై తన్యా మహారాణిలా ఉయ్యాలూగుతున్నది.. చీనా పత్తి బస్తాలకెత్తుతున్నాడు.. దూరం నుండి రామ్‌లాల్ పరుగెత్తు కొచ్చాడు. చీనా దారు పురుగుట్టి సచ్చి పోయిండంట.. అంటూ అరిచాడు. చీనా పని కుప్పకూలిపోయినంత పనయ్యింది. వుండి వుండి బోరు బోరున ఏడుస్తూనే తన్యాను మిగితా వారితో ఇంటికెల్లిపొమ్మని చెప్పి నలుగురు మనుష్యులనూ, కొంత సొమ్మునూ.. కూడేసుకుని చెల్లెలి దగ్గరకు ప్రయాణమయ్యాడు. అటు నుంచి చీనా తల్లి అన్నా ప్రయాణమయ్యారు.



ఆటో ఎక్కి స్టేజీ దగ్గర దిగి బస్సుందుకుని కొత్తగూడెంకి వెల్లి.. అక్కడనుండి వాజేడు బస్సెక్కి.. దారిలో చెల్లెలి ఊరు దిగి అక్కడ నుండి మళ్ళీ ఆటో ఎక్కి.. పడుతూ లేస్తూ.. వుండి వుండి జారుతున్న కన్నీలను తుడుచుకుంటూ చెల్లెలి ముఖం ఎలా చూడాలా.. ఆ పిల్లలనెలా ఓదార్చాలా అని బాధపడుతూ గుండె జిక్క బట్టుకుని అక్కడకు చేరుకున్నాడు.. అక్కడ దృశ్యం మరింత దారుణంగా వుండడం చూసీ చీనా గుండె ఆగినంత పనయ్యింది.. దారు మరణాన్ని తట్టుకోలేని సంతూ పురుగు మందు తాగి కొన ఊపిరితో కొట్టుకుంటున్నది. చీనా కోసమే ఆమె ప్రాణం నిలిచి వున్నదా అన్నట్టు చీనా వంక చూస్తూ ఏదో చెప్పాలనుకుని చెప్పలేక కొన్ని నిముషాల్లో ప్రాణం వదిలింది. తన చేతిలో పసిపాపలా పెరిగిన సంతు ఇపుడు నిర్జీవంగా తన చేతుల్లో వాలిపోవడం తట్టుకోలేక గంగ వెర్రెత్తిన వాడిలా తలపై బాదుకుంటూ పెద్దగా రోదించసాగాడు ఇంతలో.. మామా అని చీనాను పట్టుకుని బావురుమంటున్న ముగ్గురు పిల్లలను చూడగానే తన చెల్లెలు ఏమి చెప్పాలనుకున్నదో అర్థమయిపోయ్యింది. గుండె బాధ తీరేలా చీనా ఏడ్చుకునే వీలె లేకపోయింది. అల్లుని, కూతురి మరణం తట్టుకోలేక చలతికిలి బడిపోయిన తల్లిలి, అన్నెం పున్నెం ఎరుగని ఆ పిల్లలను ఓదా-ర్చుతూనే తన అన్న సాయంతో.. ఎలా మిగితా కార్యక్రమాలు ఎలా చేసాడో దేవునికెరుక. తానే ఏడవాలా ఏడ్చే పిల్లలనే ఓదార్చాలా అర్థం కాని దీనమైన పరిస్తితి..

పదిరోజుల కార్యక్రమాలు ముగిసేదాక అక్కడ నుండి రావడం కుదరదని.. రామ్‌లాల్ కాకా కి చెప్పి తాను తన్యాని వాళ్ల అమ్మగారింట్లో దింపమని పంపాడు. సంతూ దారు ఎంత అన్యోన్యంగా వుండే వారో పిల్లలను ఎంత ప్రేమగా పెంచారో తండాలోని వారంతా కథలు కథలుగా చెబుతుంటే కన్నీళ్ళు తుడుచుకుంటూ విన్నాడు.. ఈ మనిషి లేకుండా నేను బతకలేను అనిపిస్తుందన్నా అని చెప్పి దారును చేసుకున్న చెల్లెలు మాట నిలబెట్టుకున్నట్టుగా.. ఆ మనిషి మరణాన్ని తట్టుకోలేక పోయింది. తన పిల్లలేమయిపోతారని కూడా ఒక్క క్షణం ఆలోచించలేక పోయింది. ఇపుడు వాళ్ళ పరిస్థితి ఏమిటి.. ఆలోచన ఒకవంక తన్యా . తాను ఇవ్వన్నీ చూసి తట్టుకోలేదనే రానివ్వలేదు.. తాను వస్తానని గొడవ చేసిందట. ఎలా వుందో గడియకోసారి అనుకుంటూనే కర్మలు పూర్తిచేసాడు..

ముగ్గురు పిల్లలను తీసుకుని ఆ ఊరు దాటివస్తూ.. ఈడ నిన్ను మట్టి చేసేటందుకే నిన్ను ఈ ఊరికిచ్చినా" అంటూఅక్కడి మట్టి మీద పడి పొర్లి పొర్లి ఏడ్చాడు..

వాల్లు ఇల్లు చేరే సమయానికే తాన్యా వాల్ల అమ్మా నాయనలతో వచ్చి వున్నది. అంత దూరంలో చీనాను చూస్తూనే పరుగెత్తుకువెల్లి అతన్ని పట్టుకుని బోరు బోరుమని ఏడ్చింది. తనను చుట్టకుని ఏడుస్తున్న పిల్లలను ఆ పిల్లలను దగ్గరకు తీసుకుని అన్నం పెట్టింది. చాన్నాల్లకు తన్యాను చూసిన చీనా కాస్త కుదట పడ్డాడు. అత్తామామాలు వచ్చి వున్నందుకు సంతోషపడ్డాడు.

కాని ఆ సాయంత్రినికే తన్యాకు వాళ్ళు నాలుగు రోజులో నెల రోజులో వుండడానికి కాదు శాశ్వతంగా వుండడానికి వచ్చారని అ తాను వారికి వండిపెట్టి వాల్లను పోషించాలని అర్దమయ్యింది. తన సామ్రాజ్యాన్ని ఎవరో ఆక్రమించడానికి వచ్చిన దానిలా ఉలిక్కి పడింది. తన స్థావరం కాపాడుకునే సైనికుడిలా.. చీనా దగ్గరకు పరుగు పెట్టింది..

"వీళ్ల ఈడనే వుంటారా అంటూ అపనమ్మకంగా అడిగింది.." అవును

"తన్యా ఇక మనమే వాల్లకు అమ్మా నాన్నాలం.." స్థిరంగా చెప్పాడు.. అవును కాదంటలే మనమే చూసుకుందం. కాని

మీ అమ్మా.. అన్నా వున్నరు గదా నువ్వు చిన్నోడివి నీ మీదేసుడు దేనికి.. మీ అన్న వాళ్ల దగ్గరకు బంపచ్చుగదా.."

"నా మీదెవరూ ఎయ్యలే నేనే దీస్కచ్చిన.. పిల్లలు గూడా నాదగ్గర్నే వుంటమన్నరు."

"అవును చిన్న పిల్లలు నువ్వంటే ప్రేమ కొద్దీ అన్నరు పెద్దోల్లు వాల్లకు చెప్పాలె కదా.." నిలదీసింది.

"చీనా కావలిస్తే మనం పైసలు బంపుదాం. అవసరమైతే నేను కూడా చేన్ల పని జేస్త.." వాదించడం మొదలు పెట్టింది.

"వాల్లు ఇక్కడ మన దగ్గర వుండద్దంటావా.." బాధగా అడిగాడు..

"అవును.." ఖచ్చితంగా చెప్పింది.."మళ్ళీ అన్నీ మొదలు.. తినీ తినక గడిచీ గడవక తక్లీబ్‌ల బతుకులు.." తన బాల్యం గుర్తుకు తెచ్చుకున్నది."తన్యా వాల్లు చిన్న పోరలు..నాయనే కాదు అమ్మసుత లేని పిల్లలు.. "నచ్చజెప్పాలని చూసాడు. తన్యా వినలేదు.

"మీ అక్క దగ్గర వుంచుకోమ్మను. లేదంటే మీ అమ్మ దగ్గరకు పంపితే పెద్ద దిక్కుగా వుంటుంది."మొండికేసింది.

"అమ్మ పెద్దదై పోయింది. ఆమె చూసుకోలేదు." అన్నాడు.

"మీ అన్న దగ్గరైతే మీ వదినెకు మంచీ చెడు అన్నీ తెలుసుకదా" అన్నది.. ఆ ఊర్ల వుంటే వాల్ల చదువులకు కుదరదు అన్న తనతో పాటు పనిల బెట్టేస్తడు .."



"నా కంటే వాల్లే ఎక్కువయ్యారా.." అని ఉక్రోషపడింది. "నా మీద ప్రేముంటే.." అని మెలిక పెట్టింది. "వాళ్ళు ఈడనే వుండాలంటే ..నేనూరుకోను..నేనేమి చేస్తనో నాకే తెలియదు.." అంటూ బెదిరించింది. "అసలు నువ్వు నా చీనావేనా..?" అనుమాన పడింది. తన్యా ఎన్ని చెప్పినాఎంత వాదించినా చీనా వినలేదు.. తన్యా తన్యా అంటూ వెనుక వెనక తిరిగిన చీనా ఇప్పుడు తాన్యా ఆమెమ ముఖంలోకి కూడా చూడకుండా నిశ్చయంగా నిక్కచ్చిగా మాట్లాడుతున్నాడు..

"అయితే నేను నీ తాన వుండ అన్నది..చివరి అస్త్రంగా.." దెబ్బ తిన్నట్టుగా తెలెత్తి చూసాడు.

"అవును నువ్వు గా పిల్లలను మీ అమ్మకాడికో మీ అన్నకాడికో బంపకుంటే నేను ఈడ వుండను." ఖచ్చితంగా చెప్పింది. అనడమే కాదు తన్యా నిజంగానే వెళ్ళి పోయింది. అప్పుడు.. అప్పుడు తల వంచుకున్నాడు చీనా.. ఆనాటినుండి.. ఎవరివంకా చూడడు ఎవరిని పట్టించుకోలేదు. పిల్లలు.. పిల్లలు ప్రపంచంగా బ్రతికాడు. మొదట్లో బంధవులు తన్యాను ఎంతగానో బతిమాలారు.కోప్పడ్డారు.. నచ్చజెప్పారు వినలేదు. ఆమె రాలేదు. చీనా వెల్లలేదు, ఆ పిల్లలను వదలలేదు. ఈ పదేళ్లలో ఎన్నో మార్పులు జరిగాయి. చీనా తల్లి చనిపోయింది. చీనా చేతిలో పెరుగుతున్న చెల్లెలి పిల్లలు బాధ్యతగా చదువుకోసాగారు.. ఏడాది క్రితం తన్యా తండ్రి చని పోయాడు. అయినా తన్యా చీనా దగ్గరకు రాలేదు. తల్లి ఆమె కలిసి వుంటున్నరని విన్నాడు. గుండె దిటవు పరుచుకున్నాడు.. ఇపుడామె తల్లి కూడా చని పోయిందని..

అన్నదగ్గరకు వెళ్ళనని మొండికేసి వంటరిగా వుంటుందని విన్నాడు అతని గుండెలో ఏ తుఫాను రేగుతున్నదో..గాని తాను మాత్రం మౌనంగా ఉండిపోయాడు

మూడు నెలలు గడిచాయి. తన్యా పుట్టిల్లయిన కోక్యాతండా లో తన బంధువు చనిపోయారని తెలిసి తప్పని సరిగా చీనా ఆ ఊరికి బయలు దేరాడు. ఒకటికి రెండు రోజులు ఆ ఊర్లో వుండి అన్ని పనులు దగ్గరుండి చేయించాడు. ఆ సాయంత్రం రామ్‌లాల్ అతని పక్కన చేరాడు." చీనా .. ఇంటుంటే నాకే పాణం బేజారయితాందిరా.. తన్యాకి పాణం బాగుండక వుండుండి పడిపోతున్నదట.. వంటరిగా దిక్కులేని దానిలా పడివుందట.." తలవంచుకుని విన్నాడు "చీనా.. కాస్సేపటికె మబ్బులు కమ్ముకుని..

ఉరుములు మెరుపులతో వాన మొదలయ్యింది.. ఉరుములు వస్తే భయంతో తనను కరుచుకుపోయే తన్యా గుర్తకు వచ్చి.. మొండిగా తలవంచుకుని కూర్చున్నాడు.. ఎక్కడో పెద్ద పిడుగు పడి వర్షం మరింత ఊపందుకున్నది..

"తన్యా .. ఓ తన్యా నీ కోసంమెవలో వచ్చిన్రు.. "ఓ అమ్మాయి లంగా తట్టుకుంటుండగా పరుగులు పెట్టుకుంటూ అరుస్తూ వచ్చి చెప్పింది. నీరసంగా కళ్ళు మూసుకుని పడుకున్న తన్యా కాస్త ఓపిక తెచ్చుకుని.. తలుపు తీసి ఎవరూ అన్నది.. ఎదురుగా నిలువెత్తు మనిషి ఒక్కసారిగా తాను ఎవరిని చూస్తున్నదో అర్ధం కాలేదు.. అర్ధ మయిన మరుక్షణం ఆమె లోపలికి పరుగుతీయబోయింది..వెంటనే అతను ఆమె కాళ్లకు అడ్డు పడి.. ఆమె ముందు మోకరిల్లిట్లుగా వంగాడు తన్యా.. నేను నీ చీనానే తన్యా..నిన్ను ఇలా మోసేందుకూ.. గుండెల్లో బెట్టుకుని చూసుకునేటందుకు.. నేను ఎప్పుడూ..సిద్ధమే అన్నట్టుగా తలెత్తి ఆమె వంక చూసాడు.. ఆమె అతని చేతుల్లో వాలిపోయి.. గంగలా ప్రవహించింది.. అతను సాగరమై ఆమెను కలుపుకున్నాడు..

తన్యాకు తన సర్వసం దక్కింది. ఇప్పుడు సంతు పిల్లలకు ఓ తల్లి దొరికింది.

# మానవతాపతాక

- డా॥ కత్తి పద్మారావు
9849741695



ఆ కుండీలో క్రోటను
ఆ చినుకులకు పులకరిస్తుంది
ఆకాశం మేఘావృతం అయివుండడం
ఒక అనుభూతి
ఆ పచ్చని పొలాలు చిరునవ్వులతో
కిలకిలా రావాలు చేస్తాయి
దృశ్యాలు మారుతున్న కొద్ది
కళ్ళల్లో నూత్న ప్రపంచం
పునర్నిర్మించబడుతోంది
ఆ జొన్నకంకులు మీద పడిన చినుకు
ముత్యాల దండ తెగి రాలుతున్నట్టు వుంది
అవును!
పక్షులు బయట తిరుగుతున్నప్పటికంటే
గూళ్ళలోనే వెచ్చదనాన్ని కోరుకొంటున్నాయి
ఆ చెరుకు తోటదో అందం
కణుపు కణుపులో తీపిదనం
నీటిబొట్టులు పంచదారలో మునిగి
ధారకారుతున్నాయి
నేల తియ్యగా వుంది
చాళ్ళ నిండా రాలిన ఆకులతో
పడవల్లో ప్రయాణం
ఆ కొబ్బరి తోటల మధ్యలో వున్న
చెరువుల్లో చేపల చిందులాట
కొబ్బరి బొండాల మీదగా
నీటి చుక్కలు రాలుతున్నాయి
ఒక్కొక్క చుక్క నక్షత్రాలను
భూమి మీదకు దొల్లిస్తున్నాయి
మనిషి లేని చోటంతా
ప్రకృతి వికసిస్తుంది
నెమలి నృత్యం చేస్తుంది
జీవన ప్రభాతాలను వర్షిస్తుంది
ప్రకృతిని ఆవహన చేసుకొన్న
పక్షి సూర్యోదయంలో కొత్త రాగం వినిపిస్తుంది
ఆ పక్షి ఆ రాగాలను
మబ్బు తునకల నుండే అందుకుంది
స్వచ్ఛమైన నీరు, గాలీ రాగశద్ధికి మూలం
ఆ జవ్వని
కాల అందెల సవ్వడిలో ఏదో
అలజడి వుంది
ఆమె అంత:పురంలో వున్న పూల కుండీ
ఆ కుండీలో వున్న పూలు
బయట జడివాన కురిసినా తడవడం లేదు
ఎన్ని సజీవ స్మృతులను
అద్దాల మేడలు సమాధి చేశాయో!
నిజమే!
భావోద్వేగాలు ఉప్పెనలాంటివి
బయట వచ్చే తుఫాను శబ్దాలు
ఆ పడతి స్వరంలో నాకు వినిపిస్తున్నాయి
ఏది పొందలేదో దాని కోసం ఆరాటం
ఏది పొందామో దానిపై నిర్లక్ష్యం
అవును!
శిల్పాన్ని చెక్కినంత శులభంగా
దానికి ఊపిరిలు పోయలేం
కొన్నిసార్లు శిల్పి తన ఊపిరంతా ఊది
రాళ్ళతో రాగాలు పలికిస్తాడు
తన శక్తంతమయ్యాక
వీటికి కన్నీళ్ళు లేవని తెలుసుకొంటాడు
మళ్ళీ! ఆ తల్లి కార్చిన రెండు
కన్నీళ్ళతోనే అతడు తిరిగిలేస్తాడు
అవును!
ఆ నక్షత్రాల హోటల్ నిండా
పలిగిన సీసాల పెంకులు
కాళ్ళకు గుచ్చుకొన్నా వారికి తెలియడం లేదు
నరాల్లో ప్రవహిస్తున్న మత్తుమందులు
నల్లతాచుల్లా వారిని కాటేస్తున్నాయి
వీరందరికి వీధి దీపాలు ఆరిపోయిన
విషయం తెలుసా!
ఆ ముళ్ళ కంచెల్లో ఆ పిల్లవేసిన కేకలు
ఆకాశంలో పిడుగుల వర్షం కురిపిస్తుంది
రాళ్ళకు దూపదీప నైవేద్యాలు
చేస్తున్నారు
సాంబ్రాణి కుప్పలు కుప్పలు
ముట్టిస్తున్నారు
రాళ్ళ మీద కురుస్తున్న
పాలవర్షానికి
రాతి నేలలు సహితం మకిలి
పడుతున్నాయి
ఎవరికి చెందాల్సింది ఎవరికి
చెందుతుందో
అవును!
రేపోమాపో సూర్యుడు
భూమిని
చీల్చి చెండాడుతాడు
మనుషులు క్రూర మృగాలయే
కొద్దీ
భూమి వేడెక్కుతోంది
నెత్తురు వర్షంగా కురుస్తుంది
క్రూర మృగాలక్కూడా ఒక
నీతి వుంది
ఆ మనిషి ప్రతి శరీరాన్ని చీల్చి
చెండాడుతున్నాడు
అది జింకే కానక్కర లేదు
ఎలుకను కూడా
నిజమే!
మళ్ళీ మానవత్వానికే
పతాకలెత్తాలి
జీవన సౌరభాలు ఎదజల్లే
హృదయ కుసుమాలు
వికసించాలి
అప్పుడే మనిషిని మనిషి
ప్రేమించే యుగ వికాసం

# నవ్య సంప్రదాయం ఆధునికానంతరవాదం ప్రాతిపదిక లేనివే!


రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి

*సాహితీ స్రవంతికి, సాహిత్య ప్రస్థానంకు రాచపాళెం చిరకాల మిత్రులు. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు పొందిన సందర్భంగా అభినందనలు తెలపుతూ సాహిత్య ప్రస్థానం తొలి సంచికలో ప్రచురించిన ఇంటర్వ్యూను పునర్ముద్రిస్తున్నాం.*

***ఎప్పట్నుంచి మీరు సాహిత్య విమర్శలో ఉన్నారు?***

1972 నుంచి నేను సాహిత్య విమర్శ రాస్తున్నాను. ఎంఎ తెలుగు చదువుతున్న రోజుల్లో మా ఉపాధ్యాయులు సెమినార్లు చేయించేవాళ్ళు. 1972లో నా సెమినార్‌లో నేను 'తెలుగు సినిమా పాటల్లో సాహిత్య విలువలు' మీద పరిశోధన చేశాను. ఆ వ్యాసం 1972లో అచ్చయింది. ఆ తర్వాత 'ప్రభావతీ ప్రద్యుమ్నం' పరిశోధనాంశంగా తీసుకుని దాదాపు నాలుగైదేళ్ళు ప్రాచీన సాహిత్యానికే పరిమితమయ్యాను. 1977లో అనంతపురం పీజీ సెంటర్‌లో లెక్చరర్‌గా చేరిన తర్వాత కన్యాశుల్కాన్ని, మిగతా గురజాడ సాహిత్యాన్ని పాఠంగా చెప్పవలసి వచ్చింది. కన్యాశుల్కం పాఠంగా చెప్పడం నాకో పెద్ద మలుపు. అదివరకు ఉన్న సామాజికాభిప్రాయాలు, సాహిత్యాభిప్రాయాల్లో గురజాడ రాతలు పెద్ద మార్పు తీసుకొచ్చాయి. దాంతో కె.వి.ఆర్. 'మహోదయం', సర్దేశాయ్ తిరుమలరావుగారి 'కన్యాశుల్కం-నాటక కళ' చదివాను. ఆ విధంగా ఆధునిక సాహిత్య విమర్శ పరిచయం జరిగింది. తర్వాత గురజాడ వారి ఇతర సాహిత్యమంతా చదవడం, ఆధునిక విమర్శనా రంగంలోకి ప్రవేశించడం జరిగింది.

***తొలి విమర్శ ఎప్పుడు రాశారు?***

తొలిసారిగా 1980లో గోపీగారి 'తంగేడుపూలు'పై విమర్శనావ్యాసం రాశాను. అప్పటికి ఆధునిక సాహిత్యాన్ని విమర్శించడానికి నా దగ్గర తగిన సాధనాలు, పనిముట్లు లేవు. పూర్వ విమర్శకుల వ్యాసాలు చదివి, ఆ నమూనాలో అది రాశాను. ఆ తర్వాత అనేకమంది మార్క్సిస్టు సాహిత్య విమర్శకుల వ్యాసాలు చదివాను. ఎస్కే యూనివర్సిటీలో 'సుందరయ్య విజ్ఞాన కేంద్రం' సాంబిరెడ్డి గారు మార్క్సిస్టు రాజకీయ క్లాసులు తీసుకుంటుండేవారు. ఒకటి రెండింటికి నేను హాజరయ్యాను. ఓల్గా రచనలు, విశ్లేషణలు కూడా ప్రభావం చూపించాయి. దాంతో నా దృక్పథంలో మార్పొచ్చింది. అనంతపురంలో సాహిత్య వాతావరణం....కథారచయితలు, కవులు., సాహిత్య సమావేశాలు... లిటరరీ మీట్ అనే సాహిత్య బృందం...విశాలాంధ్ర... వీళ్ళంతా నేను సాహిత్య విమర్శకుడిగా ఎదగడానికి దోహదపడ్డారు.

***మార్క్సిస్టు సాహిత్య విమర్శనపై దాడి పెరుగుతున్న దశలో మీరు మార్క్సిస్టు దృక్పథం వైపు రావడానికి ప్రోత్సహించిన అంశాలేమిటి?***

1977-80ల దాకా నేను విశ్వనాథ సాహిత్య ప్రభావంలో ఉన్నాను. అనంతపురం వచ్చాక ఇక్కడి అవసరాలు, పరిచయాలు, ఆలోచనను విస్తరించాయి. భావవాదం వల్ల చేసేదేమీ లేదని తెలుసుకున్నాను. ఇటువైపు మొగ్గాను. కొన్ని దేశాలలో కమ్యూనిస్టు ప్రభుత్వాలు ఉన్నాయా? లేవా? అనేవి రాజకీయ పరిస్థితికి సంబంధించిన విషయాలు. జీవితాన్ని అర్థం చేసుకోవడానికి మార్క్సిస్టు సిద్ధాంతం తప్ప మరొకటి లేదు. మన భారతీయ సంప్రదాయ అలంకార శాస్త్రాల ప్రకారం చదివితే భారతమైనా అర్థంకాదు. మార్క్సిస్టు దృష్టితో చదివితేనే అర్థమవుతుంది. ఇదే సరైన ప్రమాణం. సారాంశాన్ని అర్థంచేసుకోకుండా రూపాన్ని అర్థంచేసుకోలేం. వస్తువు కోసం రూపం తప్ప రూపం కోసం రూపం కాదు.

***తెలుగులో సాహిత్య విమర్శ ఎలా వస్తోంది?***

ఇవాళ తెలుగు సాహిత్య విమర్శ రెండు ప్రవాహాల నుంచి వస్తోంది. ఒకటి విశ్వవిద్యాలయాల నుంచి ఎంఫిల్, పిహెచ్‌డిలుగా విద్యార్థులు చేస్తున్న పరిశోధన. రెండోది సాహిత్య విమర్శకులు చేసే పరిశోధన. విశ్వవిద్యాలయాల వెలుపల నుంచి వస్తున్న సాహిత్య విమర్శే రాశిలోనూ, వాసిలోనూ మెరుగ్గా ఉంటోంది. విశ్వవిద్యాలయ పరిశోధనా విద్యార్థులు, సాహిత్యం పట్ల ఇంకా పరిణతి ఏర్పడనివారే అయినందువల్ల ఆ తేడా ఉ

## సాహితీ అధ్యయనానికి మార్క్సిజం తిరుగులేని సాధనం

కేంద్ర సాహితీ పురస్కారం అందుకున్న సందర్భంగా రాచపాళం స్పందన

ఆధునిక తెలుగు సాహితీ విమర్శకు 140 సంవత్సరాల చరిత్ర ఉంది. 1876 నాటి కందుకూరి 'విగ్రహతంత్ర విమర్శనం' అనే గ్రంథం ఆధునిక సాహితీ విమర్శకు తొలి ఆనవాళ్ళు. ఆ తర్వాత 1914 నాటి 'కత్తృతత్వ విచారణ' గ్రంథంతో ఆధునిక సాహితీ విమర్శకు స్పష్టమైన రూపురేఖలు ఏర్పడ్డాయి. అనంతరం కురుగంటి సీతారామయ్య 'కత వికృతత్వ విమర్శన' పుస్తకంవచ్చింది. దీంతో సంప్రదాయ, ఆధునికవాదుల మధ్య వర్గ పోరు మొదలైంది. ఇది వందేళ్ల నుంచి తెలుగు సాహిత్యంలో ఇంకా కొనసాగుతోంది. ప్రముఖ సాహితీ విమర్శకులు కట్టమంచి రామలింగారెడ్డి 'అభ్యుదయ' సాహితీ విమర్శకు పూర్వ రంగాన్ని ఏర్పాటు చేశారు. రామలింగారెడ్డి మార్క్సిస్టు కాదు. అయినప్పటికీ ఆయన అందించిన సూత్రాలు అభ్యుదయ సాహిత్య విమర్శకు ఎంతగానో ఉపయోగపడ్డాయి. అభ్యుదయ సాహిత్య విమర్శను శ్రీశ్రీ, కుటుంబరావు, మద్దుకూరి చంద్రం, పుచ్చలపల్లి సుందరయ్య, మొదలైన వారు ముందుకు తీసుకెళ్లారు. సామాజిక చరిత్రను, సాహిత్య చరిత్రను కళాత్మకంగా ప్రతిబింబించే విధంగా చూడటమే అభ్యుదయ సాహిత్య విమర్శ లక్ష్యం. అభ్యుదయ సాహిత్య విమర్శ మొదలైన తర్వాత సంప్రదాయవాదులు కూడా సంప్రదాయ సాహిత్యంలో సామాజిక జీవితం ఉందని గుర్తించడం మొదలుపెట్టారు. ఇది అభ్యుదయవాదులు సంప్రదాయం పైన సాధించిన విజయం. నేను కూడా ఆ తానులో పోగే.. రాయలసీమలో సాహితీ వేత్తలు వల్లంపాటి వెంకటసుబ్బయ్య, చందు రామ్మోహన, నంజీవమ్మ, రా.రా. త్రిపురనేని మధుసూదనరావు, కేతు విశ్వనాథరెడ్డి, భూమన సుబ్రమణ్యంరెడ్డి తదితరులు అభ్యుదయ సాహిత్య విమర్శను ఎంతో అభివృద్ధి చేశారు. గుణాన్ని గుణంగా, దోషాన్ని దోషంగా చెప్పడం మంచి విమర్శ.



ఈ తరం రచయితలు విమర్శను గౌరవంగా స్వీకరించాలి. సాహితీ విమర్శలను సద్విమర్శలుగా గుర్తించాలి. సాహిత్యం సామాజిక జీవితానికి ప్రతిబింబం. అందుకే రాయలసీమ, తెలంగాణ, కోస్తాంధ్ర, ఉత్తర కోస్తా ప్రాంతాల జీవితాలను ప్రతిబింబించేలా వచ్చిన నవలలు, కథానికలను విమర్శనాదృష్టితో పరిశీలించడం నా జీవితంలో గొప్ప అనుభూతిగా మిగిలిందని రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి వివరించారు. మార్క్సిస్టు దృక్పథంలోనే సాహిత్య విమర్శను కొనసాగిస్తానని ఇదే తన లక్ష్యమని స్పష్టం చేశారు.

ంటున్నది. కొన్ని కేవలం డిగ్రీలు, ఉపాధి కోసం రాసినట్లు ఉంటున్నాయి. అంతేకాదు, గైడ్ చేసే విశ్వవిద్యాలయ అధ్యాపకులకూ, బయటి పరిశోధకులకూ మధ్య ఆలోచనా సరళిలో కూడా తేడా ఉంటోంది. ఇందుకు కారణం విశ్వవిద్యాలయ సమాజానికి, బయటి సమాజానికీ మధ్య 70 ఏళ్ళ తేడా ఉండడం. బయటి సమాజం ప్రభావం విశ్వ విద్యాలయాలపై ఉంటున్నది గానీ, విశ్వవిద్యాలయాల ప్రభావం సమాజంపై ఉండడం లేదు. నిజానికి యూనివర్సిటీల ప్రభావమే సమాజంపై ఉండాలి. కాని అలాంటి పరిస్థితి లేదు. ఇందుకు కారణం వాటి ధోరణులలో లోపమే అనుకోవాలి. సమాజ ప్రభావమే గుణాత్మకంగా ఉంది. నా అనుభవంలో విశ్వ విద్యాలయాల బయట ఉన్న సర్దేశాయ్ తిరుమలరావు, రా.రా., మద్దుకూరి చంద్రశేఖర్‌రావు, పుచ్చలపల్లి సుందరయ్య, చే.రా. వంటివారివల్ల ఎక్కువగా నేర్చుకున్నాను.

**సాహిత్య విమర్శలో ఆధునిక మార్గం ఎప్పుడు మొదలైందంటారు?**

కట్టమంచి రామలింగారెడ్డిగారితో ఆధునిక మార్గంలో విమర్శ మొదలైందంటారు. అయితే, అంతకు ముందు గిడుగు రామ్మూర్తి, గురజాడ వ్యాసాలను కూడా పరిగణనలోకి తీసుకోవాలి. కట్టమంచికి వారు రంగం సిద్ధం చేశారని చెప్పుకోవచ్చు. అయితే, కట్టమంచి తర్వాత విమర్శ ఆయన మార్గంలోనే పయనించలేదు. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, పుట్టపర్తి నారాయణాచార్యులు విమర్శలో వాస్తవికత మార్గాన్ని తీసుకొచ్చారు. అభ్యుదయ సాహిత్యం, విమర్శ మొదలయ్యాక ఆధునిక, ప్రాచీన సాహిత్యాలను మార్క్సిస్టు దృక్పథంలో విమర్శించడం మొదలయింది. శ్రీశ్రీ, కొ.కు., కె.వి.ఆర్., వల్లంపాటి వెంకటసుబ్బయ్య, వరవరరావు, తదితరులు సాహిత్య విమర్శను ఆ మార్గంలోకి తెచ్చారు.

***తెలుగులో సాహిత్య విమర్శ ఎంతవరకు ఎదిగింది?***

ఇది మౌలికమైన ప్రశ్నే. ఎదగలేదని అనేకులంటారు. కొ.కు. కూడా ఒక సందర్భంలో అన్నారు. రాశిలో తక్కువ కాదు. అయినా ఈ అభిప్రాయం వస్తున్నది అంటే కారణం వస్తున్నదంతా సాహిత్య విమర్శ కాదు. 'పరిచయ రచనలు' కూడా సాహిత్య విమర్శల్లో ఉండటం కనిపిస్తున్నది. రచన, రచయిత పరిచయాలే కానీ, విశ్లేషణ, సంశ్లేషణ కానివి అవన్నీ.

***పాఠకుడి స్పందన, సమీక్షకుడి పరిచయం, విమర్శకుడి విశ్లేషణ మధ్య విభజన రేఖ ఉంటుందా?***

లేదు. ప్రతి విమర్శకుడూ, పాఠకుడూ సమీక్షకుడే. తక్షణ స్పందన పాఠకుడి లక్షణం. పరిచయంతో సమీక్ష మొదలవుతుంది. ఎక్కువ భాగం సమీక్ష దశకొచ్చి ఆగిపోతూ.. అదే విమర్శగా చలామణి అవుతున్నది. దీనిని అధిగమించాల్సిన అవసరముంది. అధిగమిస్తున్న వాళ్ళూ ఉన్నారు. సాహిత్య విమర్శ ఎదగలేదనే

| | రాచపాళెం సాహిత్య కృషి | |
|---|---|---|
| * శిల్పప్రభావతి (ప్రభావతీ ప్రద్యుమ్నం మీద పరిశోధన)<br>* తెలుగు కవిత్వం - నన్నయ్య ఒరవడి<br>* గురజాడ - తొలి కొత్త తెలుగు కథలు<br>* ప్రాచీనాంధ్ర కవుల సాహిత్యాభిప్రాయాలు<br>* సాహిత్య భోధన పద్ధతులు (హెచ్.ఎస్.బ్రహ్మానందంతో కలిసి)<br>* సాహిత్య పరిశోధన సూత్రాలు (హెచ్.ఎస్.బ్రహ్మానందంతో కలిసి)<br>* ఆధునికాంధ్రకవిత్వం - ఉద్యమాలు-సందర్భాలు<br>* కథాంశం<br>* కొన్ని కావ్యాలు- కొందరు కవులు<br>* దరి - దాపు<br>* తులనాత్మక దాక్షిణాత్య సాహిత్య వ్యాసాలు<br>* మరో చర్చ<br>* చర్చ<br>* దీపధారి గురజాడ<br>* విమర్శ 2009 | * జాతాయోద్యమ కథలు (సంకలనం)<br>* కొన్ని కావ్యాలు కొందరు కవులు<br>* ప్రతి ఫలనం<br>* సాహిత్య పరిశోధన సూచనలు<br>* వేమన (వేమన పై విమర్శన వ్యాసాలు)<br>అనువాదాలు<br>* దేవుడే బాలుడైతే (కిషన్ చందర్ నవలిక)<br>* దేవుళ్ళు దెయ్యాలు, భూతాలు (అబ్రహాం కోవూర్)<br>* పున్నమిరాత్రి (కర్తార్‌సింగ్ దుగ్గల్ కథలు)<br>* మహర్షి దేవేంద్రనాథ టాగూర్<br>కవిత్వ సంపుటాల<br>* స్వర్ణభారతి సాక్షిగా<br>* సీమ నానీలు<br>* పాలి (దీర్ఘకవిత) | సంపాదకత్వం<br>* రెండు ప్రపంచాలు (కవితా సంపుటి)<br>* అనంత దర్శిని (అనంతపురం జిల్లా విజ్ఞాన సర్వస్వం)<br>* స్వతంత్రభారత స్వర్ణోత్సవ సావనీర్ (రాయలసీమ స్వాతంత్రోద్యమ చరిత్ర)<br>* దళిత కథలు - మొదటి సంకలనం (కె.లక్ష్మీనారాయణతో)<br>* విమర్శ - ప్రతి విమర్శ (డా॥సర్దేశాయి సాహిత్య విమర్శ)<br>* 1980 తరువాత తెలుగు దళిత నవల (కె.లక్ష్మీనారాయణతో)<br>* వొరుపు (శాంతి నారాయణతో)<br>* 1980 తరువాత తెలుగు స్త్రీవాద నవలలు (కె.లక్ష్మీనారాయణతో) |

విమర్శకు మరో కారణమూ ఉంది.

సాహిత్యంలో ఒక గుంపు గందరగోళం సృష్టించేందుకు శాయశక్తులా ప్రయత్నం చేస్తున్నది. ఉద్యమమే కానిదానిని ఉద్యమంగా మీడియాలో ప్రచారం చేస్తున్నది. చారిత్రక ప్రాముఖ్యం లేని గ్రంథాన్ని చాలా ప్రాముఖ్యమైనదిగా చెప్పటం, ఆకాశాని కెత్తడం చేస్తున్నారు. ఈరోజు మనం కోరుకుంటున్నది వెనకటి రోజుల్లోనే ఉందని గట్టిగా వాదిస్తున్నారు. భారతంలో భీముడు కుబేరవనం గురించి రక్షకులతో వాదిస్తూ "దీన్నేమైనా కుబేరుడు తవ్వాడా? ప్రకృతి సహజం అందరికీ హక్కుంది" అంటాడు. దీన్నిచూపి భీముడే తొలి మార్క్సిస్టు అనేవాళ్ళూ ఉన్నారు. రామాయణంలోని ఒక కథలో స్త్రీ పక్షి చనిపోయినప్పుడు పోతుపక్షి విలపిస్తుంది. ఇది చూపి స్త్రీ పురుష సమానత్వం ఆనాడే ఉంది. స్త్రీ పురుష సమానత్వం గురించి వ్యాసవాల్మీకులే చెప్పారు. కాకపోతే 'గురజాడ, శ్రీశ్రీలు దానిని కొనసాగించారు' అనేవాళ్ళూ ఉన్నారు. దీన్ని బట్టి వాళ్ళు సమాజాన్ని ఎంత తప్పుదారి పట్టిస్తున్నారో అర్థమవుతుంది. భావనలకు చరిత్ర ఉంటుంది. అన్ని భావనలూ అన్ని కాలాల్లో ఉండవు. సమసమాజం అనేది ఆధునిక భావన. మన ప్రాచీనులకు ఆ ఆలోచన లేదు. వారు అసమానతలతో కూడిన వర్ణవ్యవస్థను భగవంతుడు సృష్టించాడని, దాన్ని నిలపాలని అనుకున్నారు. సమసమాజ భావన భారతం నాడు ఉంటే ఏకలవ్యుడి బొటనవేలు కత్తిరిస్తున్నప్పుడు సమ సమాజవాది ఏం చేస్తున్నట్లు?

అసలు ఆధునిక భావజాలమని పారిశ్రామిక విప్లవం, స్వేచ్ఛా, సమానత్వ భావజాలాల నుంచి వచ్చినదాన్నే అంటున్నాం. ఆధునిక కాలంలో వచ్చిన ప్రతి రచనా ఆధునిక రచన కాదు. కానీ ఆధునిక కాలంలో వచ్చిన సంప్రదాయ సాహిత్యాన్ని ప్రేమించేవాళ్లు ఆధునిక భావనలతో వచ్చిన సాహిత్యాన్ని కూడా సొంతం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. 'మేము ఆ పంక్తిలోకి తగమా?.., అదీ మాదే!' అంటూ వచన కవిత్వం మీద కూడా సంప్రదాయవాదులు విమర్శ రాస్తున్నారు. దీనివల్ల ఏది సంప్రదాయమో, ఏది ఆధునికమో తెలియక పాఠకుడికి గందరగోళం ఏర్పడుతోంది. ఇది చాలదన్నట్లు నవ్య సంప్రదాయవాదమనే కోణాన్ని లాగారు. ఇంగ్లీషులోని 'నియోక్లాసిజం' అనే దానినుంచి దీనిని పట్టుకొచ్చారు. సంప్రదాయం అన్నాక నవ్య సంప్రదాయం అంటే.., అసమానతకు నవ్య అసమానతలాగా అనిపిస్తుంది తప్ప మరొకటికాదు.

**సిద్ధాంతాలే పనికి రావనే వాదన గురించి..?**

ఈ మధ్య సిద్ధాంతాలకు కాలం చెల్లిందని కొందరు వాదిస్తున్నారు. కేవలం మార్క్సిజాన్ని వ్యతిరేకించడం కోసమే ఈ వాదన చేస్తున్నారు. వాస్తవంగా ఆటవిక సమాజం.. ఆదిమ సమాజాలకు కూడా ఒక నిబద్ధత, సిద్ధాంతం ఉన్నాయి. ఫ్యూడల్.., పితృస్వామ్యం.., పెట్టుబడిదారీ సమాజాలకు.. అంతెందుకు.. ఎప్పటి సమాజాలకైనా గతితార్కికంగా సిద్ధాంత మంటూ ఒకటుంటుంది. ఎవరికైనా నచ్చకపోతే మార్క్సిజాన్ని వ్యతిరేకించు కోవచ్చు. ఆ స్వేచ్ఛ ఉంది.. సిద్ధాంత దృష్టినే వ్యతిరేకించకూడదు. ఇది శాస్త్రీయ ఆలోచన కాదు. పాఠకుడికీ, రచనకూ మధ్య అగాధం పెంచడం ఇది.

వచన కవిత్వం మీద సంప్రదాయ వాదుల దాడి ఇది. ఇప్పుడూ 'నవ్య సంప్రదాయ వాదమనే' పేర ఆ దాడి కొనసాగిస్తున్నారు. నవ్య సంప్రదాయవాద మనేదే అసంబద్ధ సిద్ధాంతం. విశ్వవిద్యాలయ ప్రొఫెసర్లే దీనిని ఉత్పత్తి చేస్తున్నారు.

***విమర్శనాదృష్టిలో ఆధునికానంతరవాదులపై మీ అభిప్రాయం?***

సమాజం ఇంకా ఆధునికం కాకుండానే ఆధునికానంతర వాదం అనడం అసంబద్ధమే. నేటికీ సమాజంలో కుల, మత భావనలు పోలేదు. అసమానతలు, అంతరాలు తొలగలేదు. జీవితంలో రాకుండా సాహిత్యంలో పోస్ట్‌మోడర్నిజం ఎలా సాధ్యం? ఎలా ఉంటుంది? జీవితం మారాలని, మారాల్సిన అవసరాన్ని చెప్పేదే ఆధునిక వాదం, ఆధునిక సాహిత్యం. ఇంకా

ఆ మార్పు జరగకుండానే పోస్ట్ మోడర్నిజం అంటే అది దృక్పథాన్ని గందరగోళపరిచేదే. నవ్య సంప్రదాయం, పోస్ట్ మోడర్నిజం రెండూ వాస్తవిక ప్రాతిపదిక లేనివి.

***కవిత్వంలో స్త్రీ, దళిత, మైనారిటీ, ప్రాంతీయ అస్తిత్వాలపై మీ అభిప్రాయం?***

సమాజంలోని అన్ని తరహాల వైరుధ్యాలూ రచయితలను ప్రభావితం చేస్తాయి. 1985 తర్వాత స్త్రీ, దళిత వాదాలు, 1992 తర్వాత మైనారిటీ కవిత్వం వచ్చాయి. వాటిని ఆహ్వానిస్తాను. రాజకీయ, ఆర్థిక విప్లవం, సమానత్వం రావాలంటే దానికంటే ముందే సాంఘిక విప్లవం రావాలని 1936లో అంబేద్కర్ కూడా చెప్పారు. అప్పుడే ఆ సమాజం ఆరోగ్యకరంగా ఉంటుందన్నారు. అంబేద్కర్ కులాన్ని నిర్మూలించాలన్నారు. దురదృష్టవశాత్తు నేటి కులసంఘాలు దాన్ని మరింత పటిష్టం చేస్తున్నాయి. తప్పుదారిన ప్రయాణిస్తున్నారు. ఒక విషయం చెప్పాలి. వర్గ చైతన్యమే బలమైన చైతన్యం. దళితుడు ధైర్యంగా మాట్లాడగలుగుతున్నా, స్త్రీ ఈ మాత్రం సమాజంలోకి వచ్చి పోరాడగలుగుతున్నా అందుకు కమ్యూనిస్టు పోరాటాలు ఏర్పరిచిన భూమికే కారణం. అయితే, మార్క్సిజాన్ని యాంత్రికంగా అన్వయిస్తే సరిపోదు. సాంఘిక పోరాటం, ఆర్థిక పోరాటం సమానంగా నడవాలి. తెలంగాణా పోరాటంలో కులమతాల కతీతంగా ప్రజలు ఏకమయ్యారు. దానికి భిన్నమైన చరిత్రా ఉంది. ఇంకా దళితవాడలను ఊరికి దూరంగానే ఉంచుతున్నారు. గాంధీజీ రాకపూర్వం సాంఘిక పోరాటాలు, రాజకీయ పోరాటాలు కలిసి నడిచాయి. గాంధీజీ వచ్చాక రెండు పగ్గాలూ తనే పట్టుకొని, మెల్లగా సాంఘిక పోరాటాలను వదిలేశారు. ఆయనకు వర్ణవ్యవస్థపై గౌరవం ఉండడమే అందుకు కారణం. కమ్యూనిస్టుపార్టీలు ప్రధానంగా ఆర్థిక పోరాటాలనే నడిపాయి. అది చరిత్రలో జరిగిన తప్పిదం. కార్మికుల ఐక్యతకు కూడా కులం గోడగా నిలుస్తోన్న పరిస్థితిని చూడాలి. ఇప్పుడు దాన్ని గుర్తించి సాంఘిక పోరాటాలు కూడా చేస్తున్నారు. కులవివక్ష వ్యతిరేక పోరాటం ఎప్పుడో రావాల్సింది.

***సాహిత్యానికి పఠనీయత తగ్గుతున్న రోజుల్లో విమర్శ అవసరమూ, అస్తిత్వం గురించి చెప్పండి..***

సాహిత్యం ఉన్నంత కాలం సాహిత్య విమర్శకు కూడా అస్తిత్వం ఉంటుంది. దృశ్యమాధ్యమంలో మంచి ధోరణులుంటే పఠన మాధ్యమాన్ని డామినేట్ చేస్తుంది. నేడు దృశ్య మాధ్యమంలో గ్లోబల్ కంపెనీలు, పెట్టుబడులు, ముంచేయటాలు, స్త్రీలకు స్త్రీలే శత్రువులు వంటి ధోరణులు ఉన్నాయి. కావున మంచి సాహిత్యం అనేది ఇంకా పఠన మాధ్యమంలోనే వస్తున్నది.

***సినిమా, టీవీ సాహిత్యంపై విమర్శ ఎలా ఉండాలి?***

విమర్శకులు సినిమా సాహిత్యాన్ని దాదాపు విస్మరించారు. విమర్శ రావడంలేదు. రావాల్సిన అవసరం ఉంది. సినిమా సమీక్షలంటూ వస్తున్నవాటిలో వస్తు సమీక్ష లేకుండాపోతోంది. ఇది ఫలానా హీరో కెరీర్‌ను మలుపుతిప్పే సినిమాలాంటి వ్యాఖ్యానాలకే పరిమితమవుతున్నారు. టీవీ సీరియల్స్ పరిస్థితీ అంతే. చాలా బలహీనమైన వస్తువులతో నడుస్తున్నాయి. సినిమా సాహిత్యాన్ని విమర్శించాల్సిన బాధ్యత విమర్శకులపై ఉంది. కానీ పూనుకోవడం లేదు. నేడు సీమ కథలు హిట్టవుతున్నాయి. కోస్తావాళ్లకు అది ఫిక్షన్. వాటిలో మానవ సంబంధాలు, జీవితమే ఉండవు. డబ్బు రావడమే పరమార్థం.

***రచయితలు, కవులే విమర్శకులుగా ఉండడం వల్ల సబ్జెక్టివిజమ్ కనిపిస్తోందన్న విమర్శపై మీ అభిప్రాయం?***

ప్రతి రచయితా విమర్శకుడే. నన్నయ్యనుంచీ ఇది వుంది. రచయిత తను రాసే రచనకు కూడా ఏ వస్తువు తీసుకోవాలి, ఏ దృక్పథం అనుసరించాలి అనేవి ఆలోచిస్తాడు. ఇదంతా కూడా విమర్శలోకే వస్తుంది. సినారె తన శైలిలో 'కప్పి చెప్పేది కవిత్వం, విప్పి చెప్పేది విమర్శ' అన్నారు.

***రా.రా.ను క్రూరమైన విమర్శకుడంటారు?***

నిజమే. రచననొదిలిపెట్టి రచయిత మీదుగా వెళ్లే ధోరణి ఆయనతోనే మొదలైంది. గురజాడ గురించే అలా రాశారు. రారా, త్రిపురనేని మధుసూదనరావు లాంటివారు రచనతోపాటు రచయితపై కూడా విమర్శ చేసేవారు. ఎందుకిలా అంటే 'ఇవాళ ప్రతీప శక్తులు పుంజుకుంటున్నాయి. వారిని నైతికంగా దెబ్బతీస్తేతప్ప ఎదుర్కోవడం సాధ్యంకాదు' అని రారా అనేవారు. ఇది ఆమోదయోగ్యంగా అనిపించేది కాదు.

***తెలుగు నవల నిరాశను మిగిల్చిందంటారా?***

మన నవలలు పెద్ద కథలు. గొప్ప నవలలు తక్కువ. శాఖోపశాఖలుగా విస్తరించి జీవితాన్ని చెప్పిన నవలలు మరీతక్కువ. మాలపల్లి, అతడు ఆమెలాంటి కొద్ది నవలలే ఆ ప్రమాణాలకు అనుగుణంగా ఉన్నాయి. భావాల పరంగా మనం వ్యతిరేకించవచ్చు గానీ విశ్వనాథ వేయి పడగలులో ఆర్థిక సామాజికాంశాలన్నీ ఉన్నాయి. జీవిత పార్శ్వాలన్నీ ఉన్నాయి. మాలపల్లి రచయిత గాంధీయిస్టు. కానీ సమకాలీన మార్క్సిజం కూడా రాశారు.

***ప్రపంచ స్థాయిలో నేడు వస్తున్న విమర్శ పరిస్థితి?***

విదేశాలలో సాహిత్య విమర్శ పరిస్థితి మనకంతగా తెలియదు. స్ట్రక్చరలిజం, రీస్ట్రక్చరలిజం అనేవి ప్రధానంగా ఉన్నాయి. డీస్ట్రక్చరలిజమూ ఉంది. ఏతావాతా మనుషులు ఇంకా విడిపోవాలి. వ్యక్తి స్థాయికి చీలిపోవాలి అనేది పోస్టు మోడర్నిస్టుల మాట.

***యూనివర్శిటీలో వస్తున్న పరిశోధనల పరిస్థితి?***

యూనివర్శిటీలో ఇప్పుడెవ్వరూ ప్రాచీన సాహిత్యాన్ని పరిశోధించడంలేదు. అక్కడి సంప్రదాయవాదులు కూడా ఆధునిక సాహిత్యాన్నే పరిశోధిస్తున్నారు. కానీ టూల్స్ ఆధునికమైనవి కాదు. దీనికి విద్యార్థులను తప్పుపట్టాల్సిన పనిలేదు. కారణం అధ్యాపకులే. వీటిలో కూడా కొన్ని వాసి కలిగినవి వస్తున్నాయి. ఇటీవల అప్సర్, సుంకిరెడ్డి నారాయణరెడ్డి వంటివారు రాసినవి మంచి విమర్శలు.

**(సాహిత్య ప్రస్థానం తొలి సంచిక (అక్టోబరు-డిసెంబర్ 2002)**

## చీకటిని చీల్చాల్సిందె

- వల్లభాపురం జనార్దన
9440163687

చీకటి మనిషి అంతరంగాన్ని
బలహీన పరచే బెదురుబొమ్మ
సమాజాన్ని ఛిద్రం చేసే పద్మ వ్యూహమే
అయినా అంటరానిది కాదు
వెలుగు మొలకలకు నేపథ్య సంగీతం
ఆశయ ప్రయోగానికి పరీక్ష నాళిక
వెలుగుకు చీకటి సాపేక్షమే
అందుకే ద్వేషించాల్సిన పనిలేదు
ఆహ్వానించాల్సిందే
కౌగిలించుకోవాల్సిందే
కౌగిలిని కాలపాశంగా మార్చాల్సిందే
చీకటి స్వాగతిస్తే లొంగి పోవటం కాదు
భయానికి భయం పుట్టించడమే
చీకటి దెబ్బలను రుచిచూడకుండా



మెరుపు తీగెలను జీవిత విద్యుత్తుగా
ప్రవహింపజేసుకోవటం సాధ్యం కాదు
మనిషి చైతన్య పటిమ శిల్పంగా
మారాలంటే
చీకటి కోరను ఉలిగా
మార్చుకోవాల్సిందే
చీకటి కల్పించే అగాధ పద్మవ్యూహాలను
ఛేదించడంలో అభిమన్యులం కాకుండా
కొత్త సమాజ సూర్యుణ్ణి సృష్టించే
కాన్స్టోలమై చీకటిని చీల్చాల్సిందే
అంతు చూడాల్సిందే
కొత్త వెలుతురును
సృష్టించుకోవాల్సిందే

## వలస అయిపోయింది

- రేణుక అయోల
9963889298



వలస పక్షిలా ఎగరాలి
ఇక్కడ గూడు తిండి నిద్ర ఒదిలి
సముద్రాలు దాటి ఎగరాలి

రెక్కలు వచ్చిన పిల్ల గూడు మధ్యలో
ఇరుక్కున్న పాదాలని బలవంతంగా కదుపుతూ ఎగరాలి
నీటి చెలమని ఇసుకతో కప్పిపెట్టి ఎగరాలి

గింజలున్న చోట బతుకులంటే నమ్మాలి
తడిమడిలో రెక్కలు నానిపోతాయని చెప్పాలి-
గొంతులో ఆగిపోయిన జాగ్రత్తలని మింగేసి ఎగరాలి

పక్షుల పసిరెక్కల జాడలకోసం ఎగరాలి
రెక్కల నడకలని ఓదార్చే చేతుల పట్టునుంచి
తప్పించుకుని ఎగరాలి ఆకాశాన్ని నమ్ముకుని ఎగరాలి
అక్కడ ఏముంది ఇక్కడ ఏమీలేదు చిక్కుముడులని
విప్పుకుంటూ ఎగరాలి
ఎగరడం ఆగిపోనంత వరకు ఎగరాలి...

## మెట్టు దిగని భయం

నూనెల.శ్రీనివాస రావు
949297023



రోజూ ఆమెనలా
చూస్తూనే వున్నాను-
తెల్లారి టీకప్పులా
మధ్యానం భోజనంలా
రాత్రి పడకలా-
నా అలసటలో
ఆవేదనలో
తీరికలో
వేడుకలో
అన్నిట్లో ఆమెను
రాత్రి చూడని పగటిలా
పగలు చూడని రాత్రిలా
అలా చూస్తునే వున్నా-
అలా చూస్తున్నా
నేను చూడనిది
చూడలేనిది
ఆమె కళ్లను-
ఎందుకో....
ఆ కళ్ళ వెనుక
భావ విస్పోటనంలో
నేనో మెట్టు జారిపోతాననే
భయం కాబోలు.

# నిరుపమాన కవిత్వం




- మండవ సుబ్బారావు
9493335150

**క**విత్వం చదువుతున్నంత సేపు మూడు మాటలు పదే పదే గుర్తుకొస్తుంటాయి. కవిత్వం ఏమిటి? కవిత్వం ఎందుకు? కవిత్వం ఎలా రాయాలి? ఈ రోజు కవిత్వం పేరుతో అచ్చవుతున్నదంతా కవిత్వమేనా? వారం వారం పత్రికల్లో వండి వడ్డిస్తున్న కవిత్వంలో కవిత్వం పాలెంతా? నా మట్టుకు నాకు ఎక్కువ శాతం కవిత్వం కనిపించడం లేదు. ఎక్కువ శాతమంటే 51 శాతమా? 60 శాతమా? 99 శాతమని చెప్పడానికి పెద్దగా సాహసం చేయవలసిన పనిలేదు. ఊరకే అక్షరాల్ని పేర్చి కవిత్వమంటే కుదురుతుందా? "గుట్టలు గుట్టలుగా అక్షరాలు/ దుర్భిణి వేసి వెతికినా కానరాని కవిత్వం... సాగిలపడి నమస్కరిద్దామంటే.... ఒక్క వాక్యమూ వెంటరాదేం" -అని కవి వాపోయినట్లే చదువరీ వాపోతున్నాడు.

"Poetry is painting with the gift of speech" -అని 556-468 బీసీలో Simonides అనే గ్రీకు కవి చెప్పింది పాత బడిపోయింది. "Poetry is rhythmical creation of beauty in words" -అని Edgar Allan Poe చెప్పిన మాట మనకు గుర్తు లేదు. ఉన్నా గుర్తు రాదు. 1802లో William Wordsworth చెప్పిన "Poetry is the spontaneous outflow of powerful feelings" అన్న మాటల్లో మొదటి భాగమే మిగిలింది.

"అనుపమ" నిండా నిరూపమానమైన కవిత్వం వర్షించిందని చెప్పడానికి నేనేమీ సాహసం చేయడం లేదు.

"నాలో లోపల కురుస్తున్న
దిగులు వర్షాన్ని"..........
రాత్రిని తాగుతూ
చీకటిని నంజుకొంటున్నాను".........
................
ఇవాళ చారెడు కందిపప్పు కోసం
.........................
పంటి కింద రాళ్ళయ్యాయి
........... నా చేలో కాసిన కంది చెట్ల కాయలు
..........................
..................... దాక్కున్నాయి
నక్షత్రాలలో నక్షత్రాలై..........."

వావ్.... "మాటల్ని నాటితే
మాటలే కదా పండేది." - As you sow so you reap-. ఇహ

కవిత్వం ఎందుకు? అన్నది మరో ప్రశ్న. ఓ-ఇదేమన్నా చిన్న ప్రశ్ననా?" కదిలించటానికి, పెను నిద్దుర వదిలించడానికి" అని వో మహా కవి చెప్పాడు. కవిత్వం సమాజానికి చైతన్యం రగిలించడానికని ఎందరో మహానుభావులు చెబుతూ వచ్చారు. ఈ రాళ్ళతో తూద్దామా? ఐతే సంధ్యా సమయంలో నక్షత్రాల

వలే అక్కడో కవిత ఇక్కడో కవిత కనిపించి కనిపించనంతగా దొరుకుతాయి. సమాజానికి పట్టిన రోగం వదిలించడానికి కవిత్వం ఉపయోగపడుతుందా? శ్రీశ్రీ ఒక చోట అంటాడు, తాను రాసిన "మహాప్రస్థానం రోగం నిదానమే చేస్తుంది గానీ రోగానికి వైద్యం చెయ్యదు" -అని. అంటే కవిత్వం లేపనమన్న మాట. మందు మరేదో వుంది. "నేను అసంపూర్ణంగా వదిలేసిన వాటిని ఇతరులు పూర్తి చేస్తారు. సాహిత్యమనేది ఒక నిరంతర ప్రవాహం. అది నాతో ప్రారంభం కాలేదు. అది నాతో అంతం కాబోవడం లేదు"- శ్రీశ్రీ. శ్రీశ్రీ అన్నట్టు ఇంకా కవులు నేటి సమాజ పోకడల్ని ఫోటోగ్రాఫ్ చేస్తూ, చాలా వాస్తవంగా రాస్తున్నారు. కానీ ఈ పరిస్థితుల్ని ఎలా మార్చగలం? మార్చడానికి ఏమిటి చేయాలి? అన్నది ఇంకా మిగిలే వుంది. ఇప్పుడు కవులు డబ్బుల కోసం హోదాల కోసం కవిత్వం రాయడం లేదు. ఒక బాధ్యతగా నిబద్ధతతో రాస్తున్నారు. అందువలన సమాజం పట్ల బాధ్యత గల మాధవరావు వంటి కవుల కవిత్వంలో మానవ జీవితాలుంటాయి. మనిషి ఎక్కడ దోపిడీకి గురవుతున్నాడో, ఎక్కడ దగా పడ్తున్నాడో అక్కడ నుంచి కవిత్వం పుడుతుంది.


బండ్ల మాధవరావు

''దేశమంటే మట్టి కాదోయ్.........' అన్నాడో మహానుభావుడు. ఆ సందర్భం వేరు. ఇప్పుడు దేశమంటే మనుషులే కాదు. మట్టి కూడా,

మట్టి బొగ్గు
మట్టి ఖనిజం
మట్టి బాక్సైట్
అడవుల్లోంచి
కొండల్లోంచి
సొరంగాలు సొరంగాలుగా
ధనమవుతున్న మట్టి" - దేశంగాక మరేమవుతుంది?

"మట్టిని పణంగా పెట్టి/ రాజ్యాల్ని కొంటున్నాడు .......... ఎందుకు?

అందుకే కవి అంటాడు-

"నేను ఎన్నిసార్లు మరణించినా
తిరిగి తిరిగి మొలుస్తూనే ఉంటాను
................ మట్టి కోసం"

పాలించే వాడి పదఘట్టనల క్రింద నలిగి, మౌనంగా రోదించడం కాదు. తిరిగి తిరిగి మొలుస్తూ, నిరంతరం మట్టి కోసం పరుగెత్తమని రగిలించడం కవిత్వం.

ప్రపంచీకరణ ఫలితంగా ఛిద్రమవుతున్న బతుకుల్ని కవిత్వీకరించడమంటే.... మనల్ని మనం అద్దంలో చూసుకొని, ఏం చేస్తున్నామని ప్రశ్నించుకోవడమే. ఎవడు పోయి ఎవడు వచ్చినా మన బ్రతుకులు మారవు. అందుకని నిరాశ నిస్పృహలు కాదు కావలసింది.

"మొలకెత్తి తేనే కదా విస్తరించేది
మొదలుపెట్టు
జీవించడాన్ని
ఇప్పుడే
ఇక్కడే
మొదలుపెట్టు"- అని కవి కర్తవ్య బోధ చేస్తున్నాడు. ప్రగతిశీల భావాలు నాటడానికి కవి ఏ చిన్న సందర్భం దొరికినా అల్లుకుపోవాలి. మాధవరావులో నీటి గుణం జాస్తిగా కనిపిస్తోంది. వాలుగా పారుతూనే, అవసరమైన చోట ఆనకట్టై - విద్యుత్తు ప్రవహింపజేస్తున్నాడు.

ప్రపంచీకరణ ప్రతిదాన్ని వ్యాపారం చేసి జనం నోళ్ళల్లో ఎలా మట్టిగొడ్తుందో చెబుతూ, ఆ జనం మేలుకుంటే- వాళ్ల కళ్లల్లో కారం గొడ్తారని- వాళ్ళ కొంపల్లో మిరపగాయలు బోసి తగలేస్తారని- హెచ్చరిస్తున్నాడు.

"భూ గోళం మన గుప్పిట్లో ఇమిడిందేమో గానీ
జీవితాలు దూరంగా నెట్టేయ బడుతున్నాయి"-

అని ఇప్పుడు మనమందరం సెల్లో బంధీల మయ్యామంటూ కవి హెచ్చరిస్తున్నాడు. పిల్లల గదుల్లోని రహస్య సంభాషణలు ఎక్కడికి దారితీస్తున్నయో ఆలోచించమని.

కవి మేధావేనా? అయితే కవి కేవలం పరిస్థితుల్ని రికార్డు చేయడమేనా? సమాజాన్ని ముందుండి నడిపించవలసిన పనిలేదా? వాస్తవ పరిస్థితుల్ని కవితాత్మకంగా, రమ్యంగా, రమణీయంగా చెప్పడమే అయితే ఈ పని మధ్యయుగాల్లో కవులు ఎప్పుడో చేశారు. మరి ఆధునిక కవి చేయవలసిందిది కాదు.

"నీ అక్షరాల్ని అగ్నిలో మండించు
ఎప్పటికైనా సమస్త ఆయుధాల్ని జయించే అంతిమ ఆయుధం
అక్షరమే"- అన్న మాధవరావు మాట అక్షరాల నిజం

చివరగా,

"ఈ రోజు మొదలుపెడదాం
కొత్త కాలపు సువాసనల్ని శ్వాసిద్దాం
నిన్నటి దుఃఖాల్ని దిగుళ్లనీ
మంటల్లో వేసి"........ మాధవరావు కవిత్వం నిండా సమస్యలే కాదు- ఓదార్పు వుంది. ఆశ వుంది. ఆశయం వుంది. ఆవేదన వుంది.- ఆవేశం వుంది. సేద దీర్చే చెలమలున్నాయి. చేదుకునే స్నేహ హస్తాలున్నాయి. ఆత్మహత్యల ఋతువులను తృణీకరించి భవితవ్యాన్ని సాకారం చేసుకుందాం- రండి. మన ప్రపంచాన్ని మనమే నిర్మించుకుందాం.



# ముతక కథనం మూలింటామె




చెప్పాలంటే పచ్చనాకు సాక్షిగా నుంచి నామిని నెంబర్ వన్ పుడింగి రాసేనాటికి ఈ రచయితలో మార్పు అంతకంతకూ ప్రస్ఫుటమవుతూ వచ్చింది. జీవిత సత్యాలను సహజభాషలో చెబుతాడన్న ప్రశంస కాస్త వికటించింది. ప్రకృతిలో ప్రపంచంలో ప్రథమ సత్యమైన అమ్మ ప్రేమను చెప్పినంత వరకూ ఆయన శైలి అంత స్వచ్ఛంగానూ వుంది. ఆ పైన మిట్టూరులో మట్టిమనుషుల గురించి చెప్పినప్పుడు కూడా జీవన భాష్యంలానే అనిపించింది. ఒక దశ తర్వాత రచనా శైలి ఇంకా చెప్పాలంటే రచయిత శైలి మారుతూ వచ్చింది.

**- తెలకపల్లి రవి**

పచ్చనాకు సాక్షిగా జీవిత సత్యాలను చెప్పే నామిని తాజా నవల 'మూలింటామె'పై చాలా చర్చలే జరిగాయి. అవి జరిగి కూడా చాలా కాలమైనప్పటికీ అడపాదడపా ఇంకా వినిపిస్తున్నాయి. ఇకముందు కూడా అవి ఆగకపోవచ్చు. నామిని మొదటి ప్రచురిత పుస్తకంపైన ప్రథమంగా సమీక్ష రాసిన వ్యక్తిగా(ఆ సంగతి ఆయన నాతో అన్నారు గాని మరెక్కడా గ్రంథస్తం చేసినట్టు లేరు గనక ఆయన మాటే చివరి మాట) వీటిపట్ల నిర్లిప్తంగా వుండలేని తనం. మూలింటామె నవలపై చర్చలో అధిక భాగం అందులో వున్నది వాస్తవమా కాదా పల్లెల్లో అలాటి వారు వున్నారా లేదా అనే నైతిక కోణంలోనే నడిచినట్టు కనిపిస్తుంది. రచనగా, రచయిత దృక్పథ సూచికగా దాన్నెలా చూడవలసి వుంటుందనేది నా పరిశీలన.

చెప్పాలంటే పచ్చనాకు సాక్షిగా నుంచి నామిని నెంబర్ వన్ పుడింగి రాసేనాటికి ఈ రచయితలో మార్పు అంతకంతకూ ప్రస్ఫుటమవుతూ వచ్చింది. జీవిత సత్యాలను సహజభాషలో చెబుతాడన్న ప్రశంస కాస్త వికటించింది. ప్రకృతిలో ప్రపంచంలో ప్రథమ సత్యమైన అమ్మ ప్రేమను చెప్పినంత వరకూ ఆయన శైలి అంత స్వచ్ఛంగానూ వుంది. ఆ పైన మిట్టూరులో మట్టిమనుషుల గురించి చెప్పినప్పుడు కూడా జీవన భాష్యంలానే అనిపించింది. ఒక దశ తర్వాత రచనా శైలి ఇంకా చెప్పాలంటే రచయిత శైలి మారుతూ వచ్చింది. వీరారాధనలూ విచక్షణా రహితమైన స్వీయారాధనల దుష్ఫలితంగానే ఇది కనిపిస్తుంది. ఇలా జరక్కూడదంటే రచయితలకు చాలా స్వీయ నిబద్ధత లేదా నియంత్రణ వుండాలి. నీతి రీతి ఎవరి ఇష్టం వారిది అనిచెప్పడాన్కి నియతి నిజాయితీ వుండాలి.

మూలింటామె నవలలో కథ ముగ్గురు మహిళలకు లేదా 'ఆడాళ్లకు' సంబంధించింది. మూలింట్లో ముగ్గురు ఆడాళ్లున్నారు. రచయిత మాటల్లో మూలింటి మొదటామె, నడిపామె, చివరామె. మొదటి ఇద్దరికి భర్తలు పిల్లలు పుట్టగానే భర్తలు పోయారు. నడిపామె తన బిడ్డను అంటే చివరామెను అన్నకే ఇచ్చుకుని తల్లితోనే వుంటున్నది. సదరు చివరామె తక్కువ కులం వాడితో వెళ్లిపోవడం కథకు మొదలు. మొదటామె పిల్లికోసం విచారించి వూపిరి వదలడం చివర. ఈ మధ్యన చివరామె స్థానంలోకి వచ్చిన పందొసంత(పంది వసంత-లావుగా వుంటుంది గనక) ఒకటికి రెండు వివాహేతర వ్యవహారాలతో వ్యాపారాలతో కథ నడుస్తుంది. ఈ పందొసంతలను పల్లెటూరి జనం కూడా నిరభ్యంతరంగా ఆమోదించేసి దానివల్ల లాభం పొందుతుంటారు.

ఏ పల్లెల్లో ఏఏ పదాలతో తిట్లతో బూతులతో ఆడజనం మాట్లాడుకుంటారో తెలియదు గాని నామిని ఎంచుకున్న ఈ కథ పొడుగునా ప్రతిపేజీకి కనీసం వది వలకలేని మాటలుంటాయి. మూలింటి మొదటామెతో సహా ఆడవాళ్లందరూ లోలోపల చాలా చేశామని చెప్పుకుంటుంటారు. మరోవైపున వయసులో చాలా చిన్నదైన పందొసంతను పెళ్లి చేసుకున్న నారాయుడు మాత్రం ఇవేవీ పట్టకుండా ఆమెతో'' సహజీవనం' చేస్తున్న గుడుగుడు చంద్రుడికి తోకలా వ్యవహరిస్తుంటాడు. ఈ ముగ్గురూ ఒక జట్టుగా మెలగడం, ప్రత్యేకించి వసంత చంద్రుల పోకడలు రచయిత విపులంగా వివరంగా పొందుపరుస్తాడు. కులాల వారి పరిభాషలో బోలెడు వ్యాఖ్యానాలుంటాయి పనిలో పనిగా పందొసంత ఇంటిచుట్టూ వున్న చెట్లను కొట్టేయించడం, చిల్లరకొట్టు పెట్టడం, వ్యవసాయం నుంచి వ్యాపారం వైపు మళ్లడం, భర్తను కూడా నాగరికుడి మాదిరిగా చేయడం వంటి

అంశాలుంటాయి..ఇవన్నీ ప్రపంచీకరణ ప్రభావం చూపించేవని కొందరు విశ్లేషిస్తే నామిని సహజ భాషాభావాలకు మరికొందరు ముగ్ధులవుతున్నారు.

మూలింటామె నవల (నిజానికి పెద్ద కథ) పల్లెటూళ్లలో మారుతున్న పరిస్థితులను చిత్రించిందని కొంతమంది చేస్తున్న సమర్థన వాదనకు నిలవదు. కథ ప్రకారమే చూసినా ఇవన్నీ ఈ రోజునే జరిగినవి కావు. చెట్లు కొట్టేయడం, సేద్యం మానేయడం వంటివి పందొసంతలే గాక అన్ని రకాల వారూ చేస్తారు. ఇక సహజ భాష అన్న మాటకొస్తే ఇంతకంటే పచ్చిగా మాట్లాడుకోవడం అందరికీ తెలుసు. ఆమె కన్నా ఘోరమైన పాత్రలూ తెలుసు. అయితే వాటిని ఏ మేరకు ఏ తీరుగా చిత్రిస్తామన్నదే ప్రశ్న. వందొనంత-గుడుగుడు చంద్రుడు-నారాయుడు త్రయం చుట్టూనే కథ తిప్పడం ద్వారా నామిని అదనంగా చెప్పిన కొత్త విషయమేమీ లేదు. ఇలాటి వ్యవహారాలు వుంటాయని ఎవరికీ తెలియదనీ కాదు. వాటిని రాయడం నిషేధించాలని ఎవరూ అనరు గాని అంతా నివేదించాల్సిన పని లేదని మాత్రం చెప్పొచ్చు. ఒక ఆర్థిక సామాజిక కథా క్రమాన్ని చెప్పే సందర్భంలో ఎలాటి ఘటనలనైనా పాత్రలనైనా రచయితలు పొందుపర్చవచ్చు. మాలపల్లి నుంచి మైదానం వరకూ తెలుగు సాహిత్యంలో అర్థశతాబ్ది కిందటే ఇలాటి అంశాలు వచ్చాయి. అయితే ఏ నేపథ్యంలో ఏ సందేశంతో చెప్పారన్నదే కీలకం. మూలింటామె చదివితే మాత్రం రచయిత అక్రమం అనుకున్న రాసలీలలపైనే కలం నడిపించారు. పోనీ పల్లెల్లో అది సహజం అని చెప్పడానికి రాశాడనుకుందామా అంటే జనం అలా అనుకున్న ప్రతి సందర్భాన్ని వ్యంగ్యంగా చిత్రించారు. పైగా అనేక ముఖ్య ఘట్టాల్లో పరస్పర విరుద్ధమైన కథనాలు ఇస్తూ ఏది వాస్తవమో తేల్చకుండా వదిలేశారు. వ్యభిచారం అన్న భావన ఆధారంగా ఉద్భవించిన అనేక జుగుప్సాకర పదాలను అదే పనిగా గుప్పించి వదలిపెట్టారు. అవన్నీ మహిళలను కించపర్చేవిగా వుండగా గుడుగుడు చంద్రుడి వంటి పాత్రలను మాత్రం ఘనంగానే వర్ణించారు.

**నెంబర్ వన్ పుడింగిలో కేవలం ఆత్మస్తుతి, అనుచితమైన పరనింద, ఆదరించినవారిపట్ల అపహాస్యం వుంటే మూలింటామెలో మొత్తం సమాజాన్ని చులకన చేసే జుగుప్సాకర ధోరణి వుంది. ఇందుకు విచారిస్తూ తొలినాటి సహజ వాస్తవికతకు తిరిగివస్తారని ఆశిస్తున్నాను.**

నామిని హఠాత్తుగ స్త్రీల నైతికతపై ఈ కాలంలో ఇంత కథనం వదలడం ఆశ్చర్యకరం. పైగా అనైతికత వారిలో సార్వత్రికమన్నట్టు చెప్పే అనేకానేక సంభాషణలనూ సన్నివేశాలనూ గుప్పించి వదలిపెట్టారు. వాటిని బేఖాతరు చేసినట్టు గాక సమాజమే నీతి బాహ్యమైందన్నట్టు చిత్రించారు. ఆయనకు ఆధారమైన ఉదాహరణలు ఏమిటో తెలియదు గాని మన సమాజం ఇంత అస్తవ్యస్తంగా అనాగరికంగా లేదని మాత్రం చెప్పొచ్చు. ఆయన అలా అనుకున్నా మహిళలను మాత్రమే ఆడిపోసుకోవడం సంస్కారం కాదనీ చెప్పుకోవాలి. నామిని మీద ప్రేమతోనో ఆయన భాషపైన మోజుతోనో కొందరు ఈ నవల ప్రపంచీకరణకు ప్రతిబింబం అన్నట్టు పల్లెలు నిజంగానే పాడైపోయాయన్నట్టు సమర్థించడం కూడా పాక్షికంగానే నిలబడుతుంది. ఎవరు ఏ కథ రాసినా అందులోని వైరుధ్యాలను భిన్న శక్తుల సంఘర్షణను చెబితే అప్పుడు సమాజీకులు పరిణామక్రమాన్ని అర్థం చేసుకోగలుగుతారు. అంతా పాడై పోయిందనీ లేదా పాడై పోవడం మామూలేననీ సాధారణీకరణ చేసిపారేస్తే వాస్తవికత కాదు. వాస్తవం ఎప్పుడూ అంత సరళంగా స్వబోధకంగా వుండదు. ఇంతకన్నా ఈ నవలికలోని వివరాల్లోకి పోవడం అనవసరం. పిల్లులను తీసుకొస్తేనో మొక్కల కోసం విచారిస్తేనో ఒక రచన ప్రకృతి సిద్ధమై పోదు, వికృతి మాసిపోదు.

తెలుగునాట అమ్మపైన నాకు పేటెంటు వుందని గర్వపడిన ఒక రచయిత ఆడాళ్లందరిలోనూ అదే అమ్మతనం చూడలేకపోవడం బాధాకరం. లావుగా వున్న వారిని పంది అంటారు గనక పుస్తకం పొడుగునా పందొసంత అని రాయడం కులస్త్రీల కులటతనాన్ని పేజీల కొద్ది చిత్రించడం సహజత్వం ముద్రతో నడిచిన మనో చాపల్యం మాత్రమే. ఇంతకంటే దారుణమైన విషయాలు కూడా ఘోరమైన భాషలో మాట్లాడుకుంటారు గనక అవన్నీ ఎందుకు రాయలేదంటే ఏం చెబుతారు? రచయిత తన కులం పేరే వాడుతున్నారు గనక దీనిపై ఏది రాసినా చెల్లిపోయినట్టేనా? కొడవటిగంటి కుటుంబరావు కూడా చాలా దశాబ్దాల కిందటే పతివ్రత అనే కథ రాశారు. అసలాయన కథలు నవలలు చాలా వాటిలో శారీరక సంబంధాల ప్రస్తావనలుంటాయి. మొన్న కన్నుమూసిన బాలచందర్ చిత్రాల్లోనూ నైతిక విలువల ఘర్షణను జీవితపు వికార పార్శ్వాన్ని చూపించే పాత్రలు ఎన్నో వుంటాయి గాని ఆ తరహా వేరు. సమాజంలో పౌరుల్లాగే రచయితలు కూడా ఐచ్ఛికంగా కొన్ని ప్రమాణాలు పాటించడం రచనా శిల్పంలో భాగం తప్ప ప్రత్యేక నైతిక సూత్ర బోధన కాదు. రచయిత అనుకున్నా లేకున్నా కొంతమంది ఇందులో ప్రపంచీకరణ ప్రభావాలను చూడటానికి చూపడానికి ప్రయత్నించడం కృత్రిమ సమర్థన కోసమే అక్కరకు వస్తుంది. మూలింటి మొదటామె గురించిన కథనాటికి ఏ ప్రపంచీకరణ వుంది?

నెంబర్ వన్ పుడింగిలో కేవలం ఆత్మస్తుతి, అనుచితమైన పరనింద, ఆదరించినవారిపట్ల అపహాస్యం వుంటే మూలింటామెలో మొత్తం సమాజాన్ని చులకన చేసే జుగుప్సాకర ధోరణి వుంది. ఇందుకు విచారిస్తూ తొలినాటి సహజ వాస్తవికతకు తిరిగివస్తారని ఆశిస్తున్నాను.

# కలతన నేతన్నా

- జి. వెంకట కృష్ణ
8985034894



అర అడుగు వారలో వాదిగిన
ఆరడుగుల చీర
తన కంటే వొద్దికైన వాణ్ణి చూపించనా అంటుంది.

గుంతలో ఆత్మను పొదిగిన మగ్గం
తన నిజదేహమెవరో తెలుసా అని అడిగింది.

కాలమంతటా వెలసిన నాగరికతలకు
వైభవ వస్త్రాన్ని చుట్టిన కళాత్మకత
తన సృష్టి కర్త ఎవరో తెలుసా అనింది.

కండ, కండె కండె వడికి
చీరలకు జరీపూలుగా అతికి
ఆత్మతో మగ్గపు గుంతకు జీవసమాధి అయినవాడు.

రక్తపు పోగుపోగూ తీసి
పడుగూ పేకగా తీర్చి
కండె రాట్రాన తిప్పినట్లు గానుగెద్దులా
తన బతుకును తిప్పేవాడు.

చలికి వణికి చెమటకు తడిసీ
ముండ్లు తోలి వార్పులతికీ
సమాజ అవసరానికి తన పరివార నైపుణ్యాన్ని
గౌరవంగా కప్పేవాడు.

ఒక కార్మికుడు
ఒక శ్రామికుడు
తరతరాల కడుపాత్రాన్ని
కళగా నేస్తున్న అభాగ్యుడు.

పగ్గంలా మారిన మగ్గం
తన కొసకు వేలాడుతున్నదెవరో
తెలుసా అని అడిగింది.

దగ్ధమవుతున్న గత వైభవం
ఇది ఏ యంత్రం రగిలించిన చిచ్చో
తెలుసా అనింది.
వర్తమానాన్ని చలాయిస్తున్న ధన మాయాజాలం
తన మర్మాన్ని బద్దలు కొట్టేది ఎవరు అంటుంది.

ఒక ధీమంతుడు
ఒక కళావంతుడు
ఒక కానికాలాన సీమలుదాటి వచ్చిన
తంత్రం కనికట్టు చేయగా
తను నేసిన వస్త్రానికే వేలాడుతున్న
నేతగాడు.

పెట్టుబడులు నిండిన ఒక సంత
తనను నిలువరించేదెవరని అడిగింది.

ఒక పనితనమున్న చేతన
తనలో ఆయుధముంది అందుకునేదెవరన్నది.

ఒక పడిలేచే కెరటం
తనే ఒక విజయ రహస్యం అన్నది.

ఒక వ్యూహం ఒక యుద్ధం
యంత్ర తంత్రాల కోటలను ఆక్రమించే నైపుణ్యం
పెట్టుబడులను మట్టగించే
సామూహిక చైతన్యమే నేతన్నా.

కథ



# భ్రమరం

- మల్లారెడ్డి మురళీమోహన్
8861184899

**తనకెంతో ఇష్టమైన ఆదివారం రోజున, అదీ ఉదయం పూట హాయిగా వాలుకుర్చీలో నడుంవాల్చి, ఇష్టమైన సంగీతాన్ని వింటూ ఆనంద లోకాల్లో విహరిస్తున్నాడు రాఘవ. ఆదివారం - 'ఆనంద' వారమే, ఎందుకంటే నింపాదిగా నిద్ర లేవడం నించీ 'ఫాస్ట్'ని ఫాస్ట్‌గా బ్రేక్ చేయకుండా 'అల్పాహారం'లా ఆరగిస్తూ, కాఫీని గటగటా తాగకుండా ఆస్వాదించడం వరకూ... కుదిరేది వారం మొత్తానికి ఒక్క ఆదివారం నాడు మాత్రమే.**

అటువంటి ఆనందమయ క్షణాల్లో ఫోన్ మోతలు, సెల్ కూతలు వినడానికి చాలా చిరాకుపడుతుంటాడు రాఘవ. అయినా అతని ఇష్టాయిష్టాలతో పన్లేకుండా, "ఏ తీరుగ నను దయజూచెదవో..." అన్న రింగ్‌టోన్‌తో మొబైల్ మ్రోగింది. 'వాలుకుర్చీ', 'రింగ్‌టోన్'లను బట్టి అతనిది ముదిమి వయసనుకుంటే పొరబడ్డట్టే. మూడు పదులకు మించి నాలుగు పదుల లోపు వయసువాడైనా రాఘవకి ఆధ్యాత్మిక చింతన జాస్తి. ఆధ్యాత్మికతకు మనసుతోనే తప్ప వయసుతో నిమిత్తం లేదని నమ్ముతాడు రాఘవ.

'ఆనందవారం' పూట కూడా హాయిగా ఉండనివ్వరు' అనుకుంటూ సెల్ అందుకుని బటన్ నొక్కి "హలో!" అన్నాడు.

"ఏరా, రాఘవా బావున్నావా?" అంటూ శ్రీకాంత్ అట్నించి.

"ఏరా ఏవిఁటి విశేషం...?" అనడిగాడు రాఘవ.

'ఏరా' అన్న సంబోధన వాళ్ళిద్దరూ సహాధ్యాయులన్న సంగతి తెలియజేస్తోంది.

"మన బ్యాచ్ వాళ్లందరం వచ్చేనెల రాబోయే 'ఫ్రెండ్‌షిప్ డే' రోజున కలుసుకుంటే బావుంటుందని నేనూ, కిశోర్ మొన్న క్లబ్బులో కలిసినపుడు అనుకున్నాంరా..."

'క్లబ్' అని పలికినపుడు అతని కంఠంలో దర్పం ధ్వనించింది. రాఘవ కంటే ఆర్థికంగా కాస్త పై మెట్టులో ఉన్న శ్రీకాంత్ గొంతులో దర్పం రాఘవని క్షణకాలం పాటు తెలీని అభద్రతా భావానికి లోను చేసింది.

" 'ఫ్రెండ్‌షిప్ డే' రోజున కదా... చూద్దాంలే..." అన్నాడు ధీమాగా రాఘవ, క్లబ్బులో నిర్ణయాలతో తనకేమీ నిమిత్తం లేనట్టు.

"చూద్దామంటే కాదురా, అందుకే ఇంత అడ్వాన్స్‌గా చెబుతున్నా. ఊళ్లో ఉన్న నువ్వే ఇలా అంటే, పై ఊళ్ళ నుండి వచ్చేవాళ్లు ఇంకెన్ని సాకులు చెబుతారో ఆలోచించు..." ఒప్పించే ప్రయత్నంగా అన్నాడు శ్రీకాంత్.

వీళ్లిద్దరే హైదరాబాద్‌లో ఉంటున్నారు. మిగతా స్నేహితులంతా వైజాగ్, బెంగుళూరు, ముంబై వంటి ఇతర నగరాల నుండి రావలసిన వాళ్లే.

"సరే... అలాగే కానీ... వస్తాన్రా..." అన్నాడు రాఘవ ఇక తప్పదన్నట్టు, వారిని సంతుష్టపరుస్తున్నట్టు.

"అద్గదీ... అంతే కాదురోయ్... నీతో టచ్‌లో ఉన్న వాళ్లందరి చెవిలో ఈ మెసేజ్ ఊదెయ్..." హుషారుగా అన్నాడు శ్రీకాంత్.

'వాడికెందుకుండదు హుషారు? ఎంతసేపూ తన ఉన్నతిని నలుగురి ముందూ ప్రదర్శించాలన్నదే వాడి తాపత్రయం. అందుకేగా ఎప్పుడెప్పుడు అటువంటి అవకాశం దొరుకుతుందాని ఎదురుచూడ్డం, అప్పుడప్పుడూ ఇలాంటి సమ్మేళనాల పేరిట ఆ అవకాశాలు సృష్టించుకుని, అందర్నీ పోగుచేసి తన 'ఎదుగుదల' ని ప్రచారం చేసుకోవడం వాడికలవాటేగా' అని మనసులోనే అనుకున్నాడు రాఘవ.

"సరేగానీ, పై ఊళ్ళనుండి కూడా మనోళ్లు వస్తారంటున్నావ్... మరి శశాంక్ కూడా వస్తున్నాడా? అసలు వాడు టచ్‌లో ఉన్నాడా?" అని ఎంతో ఉత్సుకతతో అడిగాడు రాఘవ.

శశాంక్‌ని గుర్చి ప్రత్యేకించి అడగడంలో విశేషముంది. కాలేజ్ రోజుల్లో శ్రీకాంత్, శశాంక్ పరస్పరం ఒకరి కేరాఫ్ ఎడ్రస్ మరొకరన్నట్టు ఒకే బైక్ మీద తిరుగుతుండేవాళ్లు. ఆర్థిక స్థితిగతుల సారూప్యత వారి స్నేహ బలానికి పునాదిగా నిలిచింది.

"శశాంక్ నేరుగా టచ్‌లో లేడు గానీ, వాళ్ల బంధువొకాయన మొన్న ఓ పెళ్ళిలో కలిశాడు. ఆయన ఇక్కడే మియాపూర్‌లో ఉంటున్నాడు. కొద్దిగా శ్రమపడి ఆయన్ని కలిస్తే శశాంక్ నెంబర్ దొరక్కపోదు... వాణ్ణి కూడా రప్పిద్దాం..." అంటూ మునుపటి కంటే రెట్టించిన ఉత్సాహంతో అన్నాడు శ్రీకాంత్.



శశాంక్ పేరు వింటూనే శ్రీకాంత్ గొంతు ఫోన్లో వినిపిస్తున్నా మనసు మాత్రం వెనుకటి రోజుల్లోకి వెళ్ళినట్టు స్పష్టంగా తెలుస్తోంది.

ఎడతెరిపి లేకుండా శశాంక్‌తో తన అనుభవాల, అనుభూతుల జాబితా చెప్పసాగాడు. ఎన్నోసార్లు చెప్పిన సంగతులే అయినా మళ్ళీ, మళ్ళీ చెప్పడం అతనికో సరదా. 'ఇన్ కమింగ్ కాల్' కాబట్టి ఇబ్బంది లేకుండా వింటున్నాడు రాఘవ. వింటున్న రాఘవకి, శశాంక్ కోసమే బహుశా ఈ 'గెట్-టుగెదర్' శ్రీకాంత్ ఏర్పాటు చేస్తున్నాడేమోనన్న సందేహం వచ్చింది. అయినా అయ్యుండొచ్చు.

"ఇంతకీ ఎక్కడ కలుసుకోబోతున్నాంరా?"

"శిల్పారామం... టైమ్, మిగతా విషయాలన్నీ మళ్ళీ ఫోన్ చేసి చెబుతా. ఇక ఉంటా మరి..." అంటూ ఫోన్ కట్ చేశాడు శ్రీకాంత్.

* * *

'పూర్వ విద్యార్థి సమ్మేళనం'... అచ్చంగా అదే కాకపోయినా, 'పాత స్నేహితుల కలయిక'ను గుర్చి ఆలోచిస్తుంటే రాఘవ మనసు తన పాత స్నేహితులందర్నీ కలుసుకోబోతున్నానన్న సంతోషంతో ఓవైపు, ఇన్నేళ్ళ తర్వాత వాళ్లను కలుసుకునేటప్పుడు తనని న్యూనతకు గురిచేసే తన 'ఆర్థిక స్థితి' వల్ల ఆందోళనతో మరోవైపు ఊగిసలాడింది.

అయినప్పటికీ నిరంతరమూ తనతో సహవాసం చేసే నిరాశా, నిస్పృహలకు కొద్ది సమయం స్వస్తి పలికి, గత స్మృతులతో కొంత నాస్టాల్జిక్‌గా, రాబోవు 'గెట్-టు గెదర్'ని ఊహించుకుంటూ కొంత పారవశ్యంతోనూ డోలాయమానం కాసాగాడు.

చిన్ననాటి సంగతులు జ్ఞప్తికి తెచ్చుకుంటున్న అతనికి పాఠశాలల్లోనే నిజమైన సోషలిజం ఉంటుందనిపించింది. ఏమీ తెలియని అమాయకత్వంతో తారతమ్యాలు లేక అందరూ కలసి మెలసి గడిపిన రోజులవి. అయినప్పటికీ అప్పుడప్పుడూ రాఘువ చొక్కా చిరుగుల్లోంచి పేదరికం తొంగి చూసేది. శ్రీకాంత్, శశాంక్ లాంటి వాళ్ల యూనిఫాం నుండి వెలువడే సెంటు వాసన క్లాసులో క్యాపిటలిజాన్ని వ్యాపింపజేసేది.

క్రమంగా వయసు, ఊహ, తరగతి పెరుగుతున్న కొద్దీ తమకు తెలియకుండానే సమాజంలోని ఉచ్చ, నిమ్నాలు తమ మధ్య కూడా పొడసూపడం గమనించాడు రాఘవ.

రాఘవకి తండ్రినుండి వారసత్వంగా అప్పులు, అనువంశికంగా అనారోగ్యమూ సంక్రమించాయి. వాటిని దాటి పరిగెత్తే 'వడి' ప్రస్తుతం వెలగబెడుతున్న ఉద్యోగానికి లేదు.

భౌతిక వాదానికి పట్టం కట్టే సంఘంలో ఘనంగా, డాంబికంగా తన ఉనికిని చాటుకోగల వనరులేవీ లేని రాఘవ సహజంగానే 'లో ప్రొఫైల్'లో ఉండిపోయాడు.

అతడు ఈ 'కకూన్' నుండి బయటికొచ్చి సీతాకోక చిలుకలా మారిపోవడానికి ఆధ్యాత్మిక చింతన, 'ఆనంద' వారాలు సహకరిస్తుంటాయి.

ఒకవైపు చిన్ననాటి స్నేహితులను కలుసుకునేందుకు మనస్సు ఉవ్విళ్ళూరుతున్నా, ఈ 'డీ మార్కేషన్' ప్రభావం వల్ల తను పెంచి పోషించుకున్న న్యూనత పరిధిని ఛేదించుకుని బయటికి రావడానికి సంశయిస్తున్నాడతను.

* * *

ఆగష్టు మాసంలో మొదటి ఆదివారం.

అనుకున్న సమయానికి శిల్పారామం వద్దకి రాఘవ స్నేహితులు ఒక్కొక్కరు రాసాగారు. కిశోర్, శ్రీకాంత్, కిరణ్, సుధాకర్, సతీష్, వాసు, నవీన్ అందరూ వచ్చారు. శశాంక్ ఇంకా రాలేదు. కలుసుకున్న అందరూ 'స్నేహితుల పండుగ' శుభాకాంక్షలు పరస్పరం తెలియజేసుకున్నారు.

శశాంక్ రాని కారణమేంటని ఒకటి, రెండుసార్లు ఒకరిద్దరు శ్రీకాంత్‌ని అడిగారు. కానీ అతను వినిపించుకోనట్టే విదిలించేశాడా ప్రశ్నని.

చాలాకాలం తర్వాత కలుసుకున్న స్నేహితులంతా మళ్లీ చిన్న పిల్లలై పోయారు. వారి మాటల్లో ఉద్యోగం, సంపాదన, భార్య, సంతానం, ఆస్తులు, బట్టతల, బానపొట్ట... కాలేజీ రోజుల ఆడ స్నేహాలు, లెక్చరర్ల నిక్ నేమ్స్... అలవాట్లు... ఇవన్నీ పొంగిపొర్లాయి.

అంతా మొబైల్ ఫోన్లలో, ల్యాప్‌టాప్‌లలో ఉన్న భార్యా పిల్లల ఫోటోలు ఒకరికొకరు చూపించుకుంటున్నారు. ఫోటోలు 'క్లిక్'

# ఫ్రీడం టవర్

జంధ్యాల రఘుబాబు
9849753298

శిధిలాల్లోనుంచి
శిఖరంలా లేచిన
ఓ ఫ్రీడం టవర్
ఉగ్రవాదానికి సమాధానంగా
ప్రజల ధైర్యానికి వెన్నులా
ధైర్యానికి సూచికగా నిలచిన
ఓ స్వేఛ్ఛా స్థూపమా
నీకు మా జోహారు

ఇప్పటికే కాగదాపట్టిన
స్వేఛ్ఛా మూర్తి
ఆకాశంకేసి చూస్తోంది
నీవారి విజయాలను కీర్తిస్తోంది
ఆగడాలనూ ఓ కంట వీక్షిస్తోంది

చమురుకై సరుకుకై
వ్యాపారానికై వ్యవహారానికై
అవని మొత్తానికి ఏకధ్రువంగా



నిన్ను నీవు మలచుకొని
ఈ ప్రపంచాన్ని
అలా ఏలుతూనే ఉంటావా
అని ప్రశ్నించవమ్మా

దేశాల మధ్య డాలర్ కట్టలతో
కళ్ళు మూసుకుని రోప్ వాకింగ్ చేస్తూ
ఎవరూ చూడలేదని
చూసినా జంకని
ఆ నాయకుల లజ్జారహిత ధోరణికి
విస్తుపోతూనే విసుక్కుంటూనే
తమ ఉనికికోసం వినమ్రంగా
సలాముచేస్తున్న వారితోపాటు
ఆ చర్యల్ని ఎండగడుతూ
రాక్షసకృత్యాలకు అడ్డుపడుతూ
అడుగడుగునా తిరుగుబాటు
చేసేవారూ
పాలుదొరకని పాపాయిలు
పెనుసైన్యంలా మారి
నీ వారి ఏకఛత్రాధిపత్యానికి
అడ్డుకట్ట వేయటానికి
ఎప్పుడూ సిద్ధమే

అందుకే ఆకాశామంత
ఎత్తున ఉన్న
ఓ ఫ్రీడం టవర్
నీవు వారికిమ్మాదా
తలమానికమే
వారి స్థితికి కూడా
నీవు ప్రతిబింబమే

ఉగ్రవాదానికి
అగ్రవాదానికి
ఈ ఫ్రీడం టవర్
వ్యతిరేకమని చెప్పవే
అప్పుడే నీవు ప్రపంచానికి
తలమానికమవుతావు

---

చేస్తున్నారు.

'రాకపోయి ఉంటే 'చాలా' కోల్పోయి ఉండే వాణ్ణ'ని అనుకున్నాడు రాఘవ.

శశాంక్ ఇక రాడని అనుకున్న తర్వాత శ్రీకాంత్‌ని అడిగాడు రాఘవ - "ఏరా, శశాంక్ రాలేదేం?" అని.

కొద్దిగా మారిన ముఖ కవళికలతో శ్రీకాంత్ రాఘవని కాస్త వక్కకి తీసుకెళ్లి, "అందరూ 'వాణ్ణి' గురించి నన్నే అడుగుతున్నారేంట్రా... రాకపోతే పోయాడు... అంతా మన మంచికే... ఎంజాయ్ చేద్దాం పద..." అంటూ వెళ్లిపోయాడు.

'ఏం జరిగుంటుందబ్బా' అనుకుంటూ ఒకింత ఆశ్చర్యానికి గురయ్యాడు రాఘవ.

స్నేహితులంతా కలిసిపోయి, మళ్లీ వారిలోనే చిన్న చిన్న జట్లుగా విడిపోయి మాట్లాడుకోసాగారు.

అందరి గుస గుసల మధ్య శశాంక్‌ని గూర్చి ఓ చేదు నిజం... భయంకరమైన నిజం... గుప్పుమంది.

అది - 'శశాంక్ కి ఎయిడ్స్ వచ్చింది'.

"నిజమా?... కాదా??"

"ఆ మచ్చ వల్లనే వాడీ 'గెట్ టు గెదర్'కి రాలేదు"

"ఆ మధ్య ఆస్ట్రేలియాలో కొద్ది రోజులు ఉండి వచ్చాడు గురుడు... అక్కడ బాగా ఎంజాయ్ చేసినట్టున్నాడు... ఇప్పుడు అనుభవిస్తున్నాడు..."

ఇలా తలా ఒక్కో బాణం సంధించసాగారు- అక్కడ లేని వ్యక్తి వ్యక్తిత్వం మీద. ఈ చివరి బాణం సంధించింది మరెవరో కాదు- శ్రీకాంత్. శ్రీకృష్ణుణ్ణి అర్జునుడో, అర్జునుణ్ణి శ్రీకృష్ణుడో మోసం చేసినట్టనిపించి మనస్సు చివుక్కుమంది రాఘవకి.

అక్కడున్న మిగతా వారిలో శశాంక్‌తో అంతగా సన్నిహిత సంబంధం లేని వారెవరైనా ఈ మాట అని ఉంటే అది 'లోక రీతి'గా సర్దుకుపోయేవాడు రాఘవ. కానీ ఒకప్పుడు అతనికి అత్యంత ఆప్తుడై, సన్నిహితంగా మెలిగిన వాడయ్యుండీ ఇప్పుడు అతడు ఒక రుగ్మతతో ఉన్నంత మాత్రాన అతనితో తనకెంత మాత్రమూ సంబంధం లేనట్టు, సామాజికంగా అతన్ని వెలి వేస్తున్నట్టూ మాట్లాడుతున్న శ్రీకాంత్‌ని చూస్తే రాఘవకి అసహ్యం వేసింది.

'బహుశా శశాంకకి ఆ వ్యాధి లేక ఈ రోజు ఈ వేడుకకి హాజరై ఉంటే... 'ఆర్థికంగా' తక్కువలోనున్న తన 'లేని తనం' శ్రీకాంత్ 'పాయింట్ ఆఫ్ ఆబ్జెక్టివ్'గా మారి వెలికి గురయ్యుండేదేమో. శ్రీకాంత్ లాంటి వాళ్లు ఎలాస్టిక్‌గా ఎలాగైనా రంగులు మార్చగల సమర్థులు... ఒక విధంగా శశాంక్ ఎయిడ్స్ వ్యాధి తన 'న్యూనత'ను 'ఆఫ్ సెట్' చేసినట్టయింది...' అని మనసులోనే అనుకున్నాడు రాఘవ.

ఇప్పటి వరకూ కాస్త గుట్టుగా, గుసగుసగా మాట్లాడిన శ్రీకాంత్ ఇప్పుడు కాస్త గట్టిగానే ఎవరితోనో చెబుతున్నాడు- "ఆ మాయదారి రోగం అంటించుకున్నవాడు రాకపోతేనే బావుంది కదూ..." అని



# సాహిత్యం - నేటి పరిశీలన



*ఫ్రాయిడ్ సిద్ధాంత కాలం నాటి - వాంఛల అణచివేత - ఇప్పుడెక్కడుంది? అవకాశాలు - విచ్చల విడితనం - వైద్య సాంకేతిక విజ్ఞానం - వంటివి అందుబాటులో ఉండడం వల్ల - వాంఛల అణచివేత - ప్రశ్నేలేదు! ఈ రచనా శైలిలో రచనల వల్ల - ఫ్రాయిడ్ సిద్ధాంత కాలంనాటి పరిస్థితులే ఇప్పుడూ ఉన్నట్లు - తప్పుడు సంకేతాలు ఇవ్వడం జరుగుతుంది. ఉన్నది లేనట్లు చెప్పడం, లేనిది ఉన్నట్లు చెప్పడం, వక్రీకరణ జరుగుతాయి! సమాజంలో వచ్చిన పరిణామాలను గుర్తించకపోవడం జరుగుతుంది! ఈ సాహిత్యం తెలిగ్గా అర్థంకాదు, పాఠకులు లేరు! కొద్దిమంది మేధావి వర్గానికే పరిమితమైపోతుంది.*

**- జయంతి పాపారావు**
**8912557961**

సమాజం - సాహిత్యం - చరిత్ర - వీటి మధ్య సంబంధాలు పరస్పరం ప్రభావితమౌతాయి. సమాజ నిర్మాణాలకూ, లక్ష్యాలకూ దిశా నిర్దేశం చేయడంలో ఉపయోగపడతాయి. సాహిత్యంలో వాస్తవాలను వక్రీకరించడం లేదా విస్మరించడం జరిగితే, ఆ ప్రభావం సమాజం మీద, చరిత్ర మీద పడుతుంది. హాని జరుగుతుంది.

సిద్ధాంతాలు - సూత్రీకరణలు - ప్రమాణాలు - దృక్పథాలు - ఆలోచనలు - సృజనశక్తి - సృజనాత్మక కళా విలువలు - సాహిత్యానికి దిశానిర్దేశం చేసి నడుపుతాయి. అవీ మారుతాయి. అవీ ప్రాసంగికతను కోల్పోతాయి. సమకాలీనతను కోల్పోతాయి. వాటిని ఎప్పటికప్పుడు పరిశీలించుకోవాల్సిన అవసరం ఉంది. వాటిని వర్తమాన అవసరాలకు అనుగుణంగా మార్చుకోవడమో, లేదా తొలగించుకోవడమో చేయాల్సి వుంటుంది. ఆ విధంగా చేసుకోకపోతే, సాహిత్యంలో వాస్తవాల వక్రీకరణ జరుగుతుంది. కొన్ని సందర్భాల గురించి మాట్లాడుకుందాం.

**చైతన్య స్రవంతి :-** ఫ్రాయిడ్ మనో విశ్లేషణ సిద్ధాంతంలోంచి సాహిత్యంలో - చైతన్య స్రవంతి - రచనా శైలి వచ్చింది. జేమ్స్ జాయిస్ రచించిన. యులీసెస్ - దీనికి ప్రమాణంగా చెప్తారు. 'సుప్త చేతన'లో బయలుదేరి, 'చేతన'లోకి వచ్చేటప్పుడు, రూపొందీ రూపొందని పద జాలం - చైతన్య స్రవంతిలో ఉంటుంది. అనియంత్రిత, ఆకస్మికత, యాదృచ్ఛికత, అసంబద్ధత, అసందర్భత, అనర్థత, అస్పష్టత, అక్రమత - వంటి లక్షణాలు కలిగి ఉన్న ఆలోచనా స్రవంతిని - చైతన్య స్రవంతి - రచనా శైలి చిత్రిస్తుంది. ప్రకృతి సిద్ధమైన వాంఛలు, అవాంఛల అణచివేత, సుప్త చేతనలో వాటి సజీవ అస్తిత్వం, కలలు, కలల్లో అవి ప్రకటిత మవడం, ఆ కలల విశ్లేషణ, మానసిక సమస్యల పరిష్కారం - ఇవీ ఈ సిద్ధాంతంలోని మిళితమైన విషయాలు. తెలుగులో కొన్ని నవలలలోనూ, కథల్లోనూ, ఈ రచనా శైలిని ఉపయోగించారు కానీ న్యాయం చేయలేకపోయారు. వక్రీకరణ కనిపిస్తుంది. ఫ్రాయిడ్ సిద్ధాంత కాలం నాటి - వాంఛల అణచివేత - ఇప్పుడెక్కడుంది? అవకాశాలు - విచ్చల విడితనం - వైద్య సాంకేతిక విజ్ఞానం - వంటివి అందుబాటులో ఉండడం వల్ల - వాంఛల అణచివేత - ప్రశ్నేలేదు! ఈ రచనా శైలిలో రచనల వల్ల - ఫ్రాయిడ్ సిద్ధాంత కాలంనాటి పరిస్థితులే ఇప్పుడూ ఉన్నట్లు - తప్పుడు సంకేతాలు ఇవ్వడం జరుగుతుంది. ఉన్నది లేనట్లు చెప్పడం, లేనిది ఉన్నట్లు చెప్పడం, వక్రీకరణ జరుగుతాయి! సమాజంలో వచ్చిన పరిణామాలను గుర్తించకపోవడం జరుగుతుంది! ఈ సాహిత్యం తేలిగ్గా అర్థంకాదు, పాఠకులు లేరు! కొద్దిమంది మేధావి వర్గానికే పరిమితమైపోతుంది.

**మాజిక్ రియలిజం :** ఏ నియమాలూ, నిబంధనలూ, నియంత్రణలూ, నిబద్ధతలూ లేకుండా, మనిషి ఆలోచనా స్రవంతి స్వేచ్ఛగా, సహజ ప్రవాహంలా సహజంగా ప్రవహించాలి. అనే ఆలోచనే - సర్రియలిజం - కళా ఉద్యమంగా రూపుదిద్దుకుంది. ఫ్రెంచి కవి, విమర్శకుడు, ఆంద్రే బ్రెపన్ దీనికి ఆద్యుడు. 1915-1925 కాలంలో జర్మనీలో - ఎక్స్‌ప్రెషనిష్టు - ఉద్యమం ఊపందుకొంది. దానికి స్వీడిష్ (స్) నాటక రచయిత ఆగష్టు స్ట్రిండ్ బెర్గ్ ఆద్యుడు. ఇది వాస్తవికతా వాదాన్ని తిరస్కరిస్తుంది. ఆందోళనలో, అభద్రతతో తల్లడిల్లుతున్న ఆధునిక మానవుని మానసికస్థితిని ఆంతరంగిక అనుభవాలతో వ్యక్తీకరించడమే దీని ప్రధాన ధ్యేయం. ఈ కళా ఉద్యమాల ప్రభావంలోంచి - మాజిక్ రియలిజం - వచ్చినట్లు తెలుస్తుంది. జర్మనీకి చెందిన ఫ్రాంజ్ రోహ్ 1925లో - మాజిక్ రియలిజం, పోస్ట్ ఎక్స్‌ప్రెషనిజం - అనే పుస్తకం రాశాడు. అందులో - మాజిక్ రియలిజం - స్వరూప స్వభావాలు విశ్లేషించాడు. స్వాప్నిక అనుభూతి - దీని ప్రధాన లక్షణంగా, లక్ష్యంగా, పేర్కొన్నాడు. బయటి ప్రపంచపు ఆంతరంగిక చిత్రాన్ని స్వాప్నిక అనుభూతిలో ఆవిష్కరించడమే దీని ధ్యేయం అన్నాడు. దీన్ని ఆధునికోత్తర వాద రచనా శిల్పంగా ఆ తరువాతి కాలంలో కొందరు భావించారు.




కొలంబియాకు చెందిన జర్నలిస్టు, గాబ్రియెల్ గార్సియా మార్క్వెజ్ 1967లో స్పానిష్ భాషలో నవల రాశాడు. అది 1970లో one hundered years of solitude గా ఆంగ్లంలోకి అనువాదమై వచ్చింది. అందులో ఈ శిల్పాన్ని ఉపయోగించాడు. ఆవిర్భవించిన అనతి కాలంలోనే విస్మరింపబడిన ఈ శిల్పం తిరిగి నిండు ప్రాణం పోసుకుంది. నగ్న వాస్తవం- ఫాంటసీ - పక్క పక్కన చేతులు కలిపి నడుస్తూ, ఆశ్చర్యం, సంభ్రమం కలిగించే ఫాంటాస్టిక్ టెక్నిక్ ఇది. యుద్ధ బీభత్సం, నిరంకుశ పాలన, అణచివేత, హింస, ద్వేషం, పేదరికం, విషాదం, నిస్సహాయత - లో భావవ్యక్తీకరణకు ఏమాత్రం స్వేచ్ఛలేని దుర్భర పరిస్థితుల్లో - అంతరార్థం - లక్ష్యంగా ఈ శిల్పం ఆవిర్భవించింది. ఈ అంతరార్థం అంత తేలిగ్గా అర్థం కాదు! ఈ శిల్పాన్ని మనం వాడుకుంటే ఏమౌతుంది? మనం దేశంలో కూడా, ఇప్పుడు అటువంటి దుర్భర పరిస్థితులు ఉన్నట్లు తప్పుడు సంకేతాలు అందుతాయి! వక్రీకరణ ఔతుంది! ప్రపంచ యుద్ధాల కాలంలో నెలకొన్న అభద్రత, ఆందోళన, నిస్సహాయత వంటి దుర్భర పరిస్థితుల్లో - తాత్కాలిక ఉపశమనం కోసం - ఈ శిల్ప మద్యం సృష్టించి సేవించారు! ఈ శిల్పం విషాదం - పలాయన వాదం - ప్రేరేపిస్తుంది! దుర్భర పరిస్థితుల్లోంచి బయటపడడానికి కావాల్సిన అర్థవంతమైన నిర్మాణశీల చైతన్యపు వాసన కూడా ఈ శిల్పానికి అసలు గిట్టదు! ప్రపంచ యుద్ధాల కాలంనాటి పరిస్థితి వేరు. ప్రజాస్వామ్య వ్యవస్థలు ఏర్పడ్డాక వచ్చిన పరిస్థితి వేరు. ఆనాటి దీనికి ఇప్పుడు ప్రాసంగికత, సమకాలీనత ఎక్కడుంటాయి?! భావ వ్యక్తీకరణ స్వేచ్ఛ కూడా ఇప్పుడు కాస్త మెరుగ్గానే ఉంది. మేథా వర్గానికే పరిమితమైన శిల్పం.

**సమకాలీనత :** ఈ విషయంలో కొందరంటున్న మాటలు ముందుగా చెప్పుకుందాం. జీవిత గమనం వేగమంత మౌతుంది. సమాజ గమనం వేగమంత మౌతోంది. ప్రజా జీవన విధానంలో, శైలిలో త్వరత్వరగా మార్పులు వచ్చేస్తున్నాయి. సమకాలీనత వేల ఏళ్ళల్లో ఉండేది. వందల ఏళ్ళల్లో ఉండేది. ఇప్పుడది అలా లేదు. కొద్దిపాటి ఏళ్ళల్లోనే మారిపోతోంది. రచయితలు ఆ మార్పులను ఒడిసిపట్టుకోవాలి. సమకాలీనతను సాహిత్యీకరించాలి - అంటున్నారు. ఈ సందర్భంలో సమకాలీనత - గురించి కాస్త మాట్లాడుకుందాం. రచయిత ఎప్పుడు లేదా ఏ కాలంలో రచనను రచిస్తాడో, ఆ కాలం ఆ రచనకు రచనాకాలం ఔతుంది. ఏ అంశంపైన రచిస్తాడో, ఆ అంశం - సమకాలీనత - ఉన్న అంశమా, కాదా అన్నది నిర్ణయించడంలో సమకాలీనత - ను నిర్ణయించే ఏకైక విషయంగా పరిగణించలేం. వాళ్ళు చెబుతున్నట్లుగా - ఏళ్ళు - సమకాలీనతను నిర్ణయించలేవు! ఆ - కొలత - సమకాలీనతను నిర్ణయించ లేదు! సమాజ సమస్య - ప్రజాసమస్య - పరిష్కారం మాత్రమే - సమకాలీనత-ను నిర్ణయించగలదు. ఏ సమస్య పైన రచయితలు రచిస్తున్నారో, ఆ సమస్య పరాష్కారం కానంత కాలం - వెయ్యేళ్ళు కావొచ్చు, వందేళ్ళు కావొచ్చు, ఎన్ని ఏళ్ళైనా కావొచ్చు - ఆ ఇతివృత్తం సమకాలీన ఇతి వృత్తమే ఔతుంది. వరకట్న నిర్మూలనం - కుల నిర్మూలనం - మత నిర్మూలనం - అవినీతి నిర్మూలనం - దోపిడీ నిర్మూలనం - వంటి సమస్యల నిర్మూలనం కానంత కాలం, ఆ సమస్యలపై వస్తున్న సాహిత్యం - సమకాలీన సాహిత్యమే - ఔతుంది. అదే విధంగా, వర్గ రహిత, వివక్ష రహిత, నిజమైన సమసమాజ ప్రజాస్వామ్య శాంతియుత

**ఆ సమస్య పరిష్కారం కానంత కాలం - వెయ్యేళ్ళు కావొచ్చు, వందేళ్ళు కావొచ్చు, ఎన్ని ఏళ్ళైనా కావొచ్చు - ఆ ఇతివృత్తం సమకాలీన ఇతి వృత్తమే ఔతుంది. వరకట్న నిర్మూలనం - కుల నిర్మూలనం - మత నిర్మూలనం - అవినీతి నిర్మూలనం - దోపిడీ నిర్మూలనం - వంటి సమస్యల నిర్మూలనం కానంత కాలం, ఆ సమస్యలపై వస్తున్న సాహిత్యం - సమకాలీన సాహిత్యమే - ఔతుంది.**

సహజీవన సంస్కృతి రానంతకాలం, ఆలక్ష్యం కోసం వస్తున్న అభ్యుదయ, ప్రగతిశీల, విప్లవ, ప్రజాస్వామ్య సాహిత్యం - సమకాలీన సాహిత్యమే - ఔతుంది. స్పష్టమైన అవగాహన లేకపోతే, సమాజం - సాహిత్యం- చరిత్ర నష్టపోతాయి. తప్పుదారిలో పడిపోతాయి.

**శిల్ప లక్షణం :** కథలో కొంత పాఠకుని ఊహాశక్తికి వదిలిపెట్టాలి - అనే శిల్ప లక్షణాన్ని కొందరు ఉన్నతంగా భావించి అనుసరిస్తారు. ఇది విరామ మేథా వర్గానికే పరిమితమైపోయిన శిల్ప లక్షణం. 19వ శతాబ్ధి మొదటి భాగంలోనే సంఘ సంస్కరణోద్యమం ప్రారంభమయింది. రెండో భాగంలో ఆధునికత - జాతీయ రాజకీయ స్వాతంత్ర్య చైతన్యం ఊపందుకొంది. ఆ విధంగా సంఘ సంస్కరణ - స్వాతంత్ర్య - అభ్యుదయ - ప్రగతిశీల - విప్లవ - ఉద్యమాలు క్రమ క్రమంగా ఉపందుకొని సాగుతూ వస్తున్నాయి. ఆ ఉద్యమాల సాహిత్యమే ప్రధాన స్రవంతి ప్రజా సాహిత్యంగా పరిగణింపబడింది. అతిసామాన్య, సామాన్య ప్రజలకు ఉద్యమాల పట్ల చైతన్యం కలిగించడం - ఉద్యమంలో భాగస్వాములను చేయడం - ఉద్యమ సాహిత్యాల లక్ష్యం. పైన చెప్పుకున్న రచనా శిల్పం ఉద్యమ సాహిత్యాలకు పనికిరాదు. అందరికీ అతి తేలిగ్గా అర్థమయ్యేటట్లు చెప్పడమే అవసరం. అంతే కాకుండా, వేగం, తీరికలేని తనం నేటి యుగ లక్షణం. ఊహాశక్తిని ఉపయోగించుకోవడానికీ మేథా వర్గానికి కూడా సమయం లేదు! 'నేను మీకంటే తెలివైన వాన్ని, నేను చెప్పను! మీరే ఊహించుకోండి - అని పాఠకుల మీదకు సవాలు విసిరినట్లే ఔతుంది! మరో నష్టం కూడా ఉంది, ఎవరికి తోచిన విధంగా వారు ఊహించుకోవడం జరుగుతుంది. దానివల్ల, రచనా లక్ష్యం నీరుకారిపోతుంది. స్పష్టత లోపించడం శిల్ప లక్షణం కాదు. అటో కాలూ, ఇటో కాలు వేసి, ద్వంద్వ ప్రమాణాలు పాటించడానికి ఈ శిల్ప లక్షణాన్ని ఉపయోగించుకున్న సందర్భాలు కూడా ఉన్నాయి! మరి ఈ శిల్ప లక్షణం ఎందుకు? ఎవరికోసం?

> *కథలో కొంత పాఠకుని ఊహాశక్తికి వదిలిపెట్టాలి - అనే శిల్ప లక్షణాన్ని కొందరు ఉన్నతంగా భావించి అనుసరిస్తారు. ఇది విరామ మేథా వర్గానికే పరిమితమైపోయిన శిల్ప లక్షణం. సాహిత్యం రాజకీయాలకు దూరంగా ఉండడమంటే, దోపిడీ వ్యవస్థను పెంచి పోషించడమే ఔతుంది. మరి ఎందుకోసం, ఎవరికోసం, సాహిత్యం రాజకీయాలకు దూరంగా ఉండాలి?!*

**వ్యవస్థ :** సాహిత్యం రాజకీయాలకు దూరంగా ఉండాలంటారు కొందరు. మన రాజకీయ వ్యవస్థ ఎలా ఉంది? కోట్ల మీద డబ్బు ఖర్చుపెట్టగలిగిన గెలుపు గుర్రాలనే రాజకీయ పార్టీలు ప్రజా ప్రతినిధులుగా నిలబడుతున్నారు. వాళ్ళు నల్ల డబ్బో - తెల్ల డబ్బో- అది కొంతా ఇది కొంతా - ఓట్లు కోసం ఖర్చుపెడుతున్నారు. అధికారంలోకి వచ్చాక, పెట్టిన పెట్టుబడికి ఎన్నో రెట్లు తిరిగి రాబట్టుకుంటాడు. ఎలా రాబట్టుకుంటాడు? అది అందరికీ తెలుసు! ఆ విధంగా - ఓటునీ - ప్రజాప్రతినిధినీ - పెట్టుబడితో కూడిన వ్యాపారంగా మార్చేశారు. అంతేకాదు, ప్రజాధనాన్నీ, ప్రజా ఆస్తులను సొంత ఆస్తిగా, కుటుంబ ఆస్తిగా, దోపిడీ మార్గాల్లో మార్చేసుకోవడం కూడా జరుగుతుంది. అక్కడితో ఆగిపోలేదు! ప్రజాస్వామ్యాన్ని కూడా సొంత ఆస్తిగా, కుటుంబ వారసత్వ ఆస్తిగా మార్చేసుకోవడం కూడా జరుగుతుంది. ఓట్లు కోసం కులం - ఉప కులం - మతం - ప్రాంతం - వంటి ప్రజల బలహీనతలను రెచ్చగొడుతూ రాజకీయ లబ్ది పొందుతున్నారు. ఇదీ మన ప్రజాస్వామ్యం తీరు! ఇది నిజంగా ప్రజాస్వామ్యమా?! మరి ఆర్థిక వ్యవస్థ ఎలా ఉంది? ప్రజలకు అవసరమైన నిత్య అవసర వస్తువులూ, ఇతర వస్తువులూ, నీరూ - గాలి - తో సహా కార్పొరేట్ ఆర్థిక శక్తులూ, ఇతర ఆర్థిక శక్తులూ, తమ గుప్పిట్లో పెట్టుకుని, ఎవరి శక్తి మేరకు వాళ్ళు, ప్రజలను దోచుకుంటున్నారు. ఇటు ధరలను పెంచేస్తూ - అటు ప్రజల్లో వస్తు వ్యామోహం సృష్టిస్తూ, ప్రజలు కష్టించి సంపాదించుకుంటున్న డబ్బు, వాళ్ళ చేతుల్లోంకి ప్రవహించేలా చేసుకుంటున్నారు. అందువల్ల, ప్రజల చేతుల్లో ఏమీ మిగలదు! ఏ ఆస్తీ ఉండదు! అప్పులే మిగులుతాయి! ప్రజలు ఆర్థిక భద్రత లేకుండా, పేదరికంలో దుర్భర పరిస్థితుల్లో ఆందోళనతో జీవిస్తారు. దీనికి రుణమాఫీ వంటి పథకాలే సాక్ష్యం. నల్లబజారు వ్యాపారాలు - నల్లధన వ్యాపారాలు - అక్రమ వ్యాపారాలు - మోసాలూ దగాలూ - ధరల, పెరుగుదల - వంటి అక్రమాలనూ, దోపిడీలనూ, పాలకులు అరికట్టలేకపోతున్నారు! ఎందువల్ల?! అవే మార్గాల్లో పాలకులూ అధికారంలోకి వస్తున్నారు కాబట్టి!! కళ్ళు ముందు నడుస్తున్న ఈ చరిత్రను ఎవరైనా కాదనగలరా? ప్రజా స్వామ్యవాదులు - మేథావర్గం - రచయితలు - సమాజంపట్ల, ప్రజల పట్ల, ప్రజాస్వామ్యం పట్ల తమ పై ఉన్న బాధ్యతను ఎలా విస్మరించగలరు? సాహిత్యం రాజకీయాలకు దూరంగా ఉండడమంటే, దోపిడీ వ్యవస్థను పెంచి పోషించడమే ఔతుంది. మరి ఎందుకోసం, ఎవరికోసం, సాహిత్యం రాజకీయాలకు దూరంగా ఉండాలి?!



# అక్షర విన్యాసం

- కెంగార మోహన్
9493375447



బహుముఖీయ దారుల్లో
వొంటరిగా సంచరిస్తున్నా
చైతన్యం ఆవరించిన స్వప్నం
కవిత్వ దుప్పటి కప్పింది
ఆకాశ క్షేత్రంలో
అక్షరాల విత్తులు విత్తి
వాక్యాలతో కావ్యాలతో
విన్యాసం చేసి
క్రాంతి పుష్పాల పంటలు
పండిస్తానన్న ధీమా
కాలం ఎగరేసిన నాణ్యానికి
బొమ్మా బొరుసు
రెండూ నేనై
విశ్వగోళంలో
కొత్త గ్రహమై
ఆవిష్కృతమౌతా
సమాంతర సరళరేఖ గుండా
సంచరించి
కలం కుంచెతో భూమధ్యరేఖ
గీస్తా

మానవీయ త్రిభుజాలెన్నో
మది కుటీరంలో దాచి
అమానవీయం చొరబడలేని
పైథాగరస్ చతురస్రాన్నౌతా
సంక్లిష్ట సందిగ్ధ సంఘర్షణలతో
పురుడుబోసుకునే
కవనానికి డిఎన్ఎగా
అవతరించి ముందుమాటనౌతా
హృదిలో ఇంకిన సిరాతో
లక్షల హెడ్జ్‌ల శబ్దాలను పుట్టించే
స్వర భావ పద చిత్రాలను
ప్రపంచ పటంపై పరుస్తా
పట్టిపడీస్తున్న అవినీతి
అన్యాయ అక్రమాలను
నాలికలో పోసి
జ్ఞాన విజ్ఞానమనే ఆమ్ల క్షారలతో
రసాయన చర్య జరిపి

విశ్వశాంతి మంటను రగిలిస్తా
ప్రగతి గమనాన్ని నిరోధించే
ఏ వస్తు వ్యామోహంలోనూ
ప్రపంచీకరణ పద్మవ్యూహంలోనూ
కూరుకుపోక
రెండంచుల ఖడ్గంతో
మతోన్మాద భేతాళున్ని
ఖండించి
విక్రమార్కుడినై
ముందుకు సాగుతా

# కవిత

- డా॥ కాసల నాగభూషణం
9444452344



అమ్మ కడుపులో
ఆమె ప్రేమామృత వీచికల మీద
నెత్తురు ముద్దనై తేలియాడుతున్నప్పుడు
నాలో ప్రాణవాయువులూది
ప్రణవ నాదమై ప్రతిధ్వనించిన కవిత!

ఊహల్ని
పద చిత్రాలుగా పరివర్తింపజేసి
నా రసనాగ్రం మీద
నవరసాత్మకంగా
నర్తింపజేసిన కవిత!

కణాన్ని అఖండంగా
క్షణాన్ని అనంతంగా
మార్చగలిగిన మహనీయ శబ్దశక్తితో
మర్త్యుణ్ణి అజరామరుణ్ణిగా
ఆశీర్వదించిన కవిత!

మనుషుల్లో
ఆశించిన అన్ని విలువలూ
ఆవిరులై
కన్నీళ్లుగా జారుతూ ఉంటే
చీర చెరగుతో నా చెక్కిళ్ళు తుడిచి
నెచ్చెలిలా నన్ను లాలించిన కవిత!

నాలోపాలను సహించి
పాపాలను క్షమించి
చల్లని తన వెన్నెల చూపులతో
నన్ను నిలువెల్లా కరిగించిన
కారుణ్య దేవత కవిత!

# 'స్ఫూర్తి పాటలు'
# శ్రామిక వర్గ చైతన్యానికి వారధులు




పాటను ఎన్నిసార్లు చదివినా రచయిత రచించేటప్పుడు పొందిన అనుభూతి పాఠకుడు పొందలేడు. ఆ పాటను ఒక గాయకునితో పాడిస్తూ, లయాన్విత సంగీత వాయిద్యాల మధ్య దాని - భావం రెట్టింపవుతుంది. సామాన్య ప్రజలకు సైతం సునాయాసంగా... అర్థమవుతుంది. ఆలోచనల్ని రేపుతుంది. ఉద్విగ్నభరిత వాతావరణాన్ని సృష్టిస్తుంది. ఉరకలేయిస్తుంది. పాటకు మాత్రమే ఆ శక్తి ఉంది. ఆ శక్తిని స్ఫూర్తి పట్టుకోగలిగాడని 'ఎర్రజెండా' పాటల్ని పరిశీలిస్తే అర్థమవుతుంది. అతని పాటల్లో అంతర్నిగూఢంగా దాగి ఉన్న మార్క్సిస్ట్ భావజాలం బహిర్గతమవుతున్నది.

డా॥ దొమ్మాటి జ్యోతి
9701923281

చరిత్ర పరిణామ క్రమాన్ని గుర్తించగలిగిన రచయితలే అద్భుతమైన సాహిత్యాన్ని సృష్టించగలుగుతారు. వారిలో కలిగే భావ చైతన్యాన్ని తట్టిలేపి మానవ సమూహాలకు దారులను వెతికి పెడుతారు. తద్వారా సామాజిక చైతన్యానికి దోహదపడుతారు. ఈ విధాన రచనా నైపుణ్యాలు మెండుగా ఉన్న రచయిత స్ఫూర్తి తక్కువేమి కాదు. స్ఫూర్తి పాటల్లో శ్రామిక వర్గ ప్రజలు పల్లవిస్తారు. చరణాలై కదం తొక్కుతారు. లయాన్విత రాగాలై ముందుకురుకుతారు. పోరు కెరటాలై ఎగిరిపడుతూ దోపిడి సమాజాన్ని గద్దిస్తారు. శ్రమంటే, శ్రమ జీవులంటే స్ఫూర్తికున్న ఆప్యాయత, వారు పడుతున్న కష్టాల్ని చూడలేని తనం వల్లనో అతని పాటల నిండా శ్రామిక ప్రజల జీవన చిత్రణ, కష్టాలు-కన్నీళ్ళు, వేదన-ఆవేశంతో పాటు వారికి జ్ఞానాన్ని అందించి చేయూత నందించాలనే దృక్పథం కనబడుతుంది.

పాటను ఎన్నిసార్లు చదివినా రచయిత రచించేటప్పుడు పొందిన అనుభూతి పాఠకుడు పొందలేడు. ఆ పాటను ఒక గాయకునితో పాడిస్తూ, లయాన్విత సంగీత వాయిద్యాల మధ్య దాని - భావం రెట్టింపవుతుంది. సామాన్య ప్రజలకు సైతం సునాయాసంగా... అర్థమవుతుంది. ఆలోచనల్ని రేపుతుంది. ఉద్విగ్నభరిత వాతావరణాన్ని సృష్టిస్తుంది. ఉరకలేయిస్తుంది. పాటకు మాత్రమే ఆ శక్తి ఉంది. ఆ శక్తిని స్ఫూర్తి పట్టుకోగలిగాడని 'ఎర్రజెండా' పాటల్ని పరిశీలిస్తే అర్థమవుతుంది. అతని పాటల్లో అంతర్నిగూఢంగా దాగి ఉన్న మార్క్సిస్ట్ భావజాలం బహిర్గతమవుతున్నది. ఈ పాటల్లో ఎర్ర జెండాను పోరులో నేల కొరిగిన వీరుల త్యాగానికి, ఆలోచనా విధానాలకు, శ్రామిక ప్రజల పక్షపాతిగా ఉంటూ... వారి కష్టాలకడగండ్లకు అండగానిలిచే ఒక గుర్తు అని

"శ్రమని నమ్ముకొని బతికేవారల
ఆకలి కేకల హక్కుల జెండై
దోపిడీ కోటలు బద్దల కొట్టగ
పోరాటానికి సైరనులూది
కార్మిక పోరు జరిగేను నిత్యం
పేదల రాజ్యం వచ్చుట సత్యం"

అంటూ ఎర్రజెండాను పేదసాదల జెండా అని తెలుపుతూ కూలివాళ్ళనందరిని ఏకం చేసి రణం చేయించిందని, పట్టిన పట్టు ఎప్పుడూ వీడలేదని, భూమికోసం జెండా భూకంపమైందని, కష్టజీవుల కంట్లో తొలకరి చినుకైందని, తొలిపొద్దు వెలుగైందని, బంధనాలు తెంచిందని, సంఘమై నిలిచిందని, సంకెళ్ళను తెంపిందని..., పేదోళ్ళకు సద్ధిబువ్వైందని, పోరాడే నిప్పు రవ్వైందని తెలిపారు. ఈ గేయాల్లో రచయిత ఆలోచనా విధానం అంతా బుక్కెడు బువ్వకోసం

తండ్లాట పడుతున్న శ్రామికవర్గ ప్రజల చుట్టే తిరుగుతుంది.

వారికి దిశానిర్దేశం చేస్తుంది. ఆత్మవిశ్వాసాన్ని అందిస్తుంది. స్ఫూర్తి పాటల్లోని ఆవేశం, దోపిడీలేని సమసమాజ నిర్మాణ కాంక్ష, శ్రమ జీవులను గుండెల కద్దుకునే ప్రేమ పూర్వక విధానం చూస్తే, ఇది వరకటి ప్రజాకవులైన తిరునగరి, సుద్దాల, వంగపండు వంటి వారి పాటల్లోని మంటకు ఎందులోనూ తీసిపోవు... శ్రమజీవి ఆవశ్యకతను తెలుపుతూ, శ్రామికులు లేకపోతే ఈ ప్రపంచం ఆగిపోతుందని చెప్తూ 'సంఘ నిర్మాణం' అనే పాటలో వంగపండు వరప్రసాదరావు


స్ఫూర్తి

"సుక్క సుక్క మీ సెమటా
ఉప్పెన సెయ్యండిరో
మినుగు మినుగు పేణాలు
మెరుపులు సెయ్యండిరో
వూది వూది మీ వూపిరి
వురుములు సెయ్యండిరో"

అంటూ శ్రమజీవులైన కార్మికులను ఉత్తేజపరుస్తూ దిశానిర్దేశం చేశారు. అవే సున్నిత పదాలతో 'వీరులూ మా వెలుగులు' అంటూ సాగే పాటలో అమరవీరుల త్యాగాలను కొనియాడుతూ

"పల్లె పల్లెలోన నాగేటి సాళ్ళల్లో
చల్లినా పోరాట విత్తులు మొలకెత్తి
ఊరూరులోన ఉద్యమాలు పుట్టి
ఉప్పెనై లేచేనురోరన్నా
ఉరికురికి పోదామురోరన్నా"

అని స్ఫూర్తి పేదల గుండెల్లో పోరాట స్ఫూర్తిని రగిలించారు. ఇండ్లస్థలాల కోసం ప్రభుత్వ భూముల్లల్ల ఎర్రజెండాల్ని పాతి, పోరాడి అమరులైన వీరుల్ని 'భూమి పోరులో' అనే గేయంలో 'భూమి పోరులో ఒరిగిన వీరులు, మొక్కై మొలిచినారురోరన్న' అని తలచుకున్నారు. పాటల రచనా నేపథ్యం తెలంగాణ మాండలిక భాషలో ఉన్నా కాని 'కష్టజీవులు ఎక్కడున్నా గాని, ఐక్యపోరాటాలు ముందుకు సాగాలి' అని అంతర్జాతీయతా భావాన్ని వెలిబుచ్చారు. 'బీడీలు చేసేటి మా బతుకు' అనే గేయంలో బీడీ కార్మికులు బీడీలు తయారుచేసే విధానం తెలిపారు. ఈ పని దుష్ప్రభావం వల్ల అనారోగ్యాల పాలైన వారి స్థితిగతుల్ని తెలిపారు. ఎంత కష్టం చేసినా గాని గిట్టుబాటు కూలి పొందలేదనే బీడీ కార్మికుల వ్యథల్ని వ్యక్తం చేశారు. బీడీ కార్మికులకు గుర్తింపు కార్డులు లేవని, ప్రావిడెంట్ ఫండ్ (పి.యఫ్), పెన్షన్ లేదని తెలుపుతూ

"కష్టించి మా బతుకు నష్టాల పాలాయె
కంపెనీ దొరలది లాభాల బాటాయె
..........................................
..........................................
మా హక్కుల కోసమయ్యి మంటలైతము
మమ్ము దోచే వాళ్ళనింక వదిలిపెట్టము"

అని ఆత్మాశ్రయ రీతిలో వర్గ సంఘర్షణా దృక్పథాన్ని వెలిబుచ్చుతూ రచయిత తన ఆక్రోశాన్ని వెలిబుచ్చారు.

ఆటోడ్రైవర్లకు జీవిత ప్రయాణంలో జాగ్రత్తలు తెలుపుతూ స్పీడ్‌గా పొమ్మనే పాసెంజర్ల మాటల్ని వినవద్దని, రోడ్డుపైన ఆపకూడదని, ప్రయాణీకులను లెక్కకు మించి ఎక్కించుకోవద్దని, తాగుడుకు అలవాటు పడొద్దని హితవు చెప్పారు. 'సావుతోటి యుద్ధము బావయ్య, ఈ మోటారు ఫీల్డంటే మామయ్య' అని 'ఆటో నడిపేటి బావయ్య' అనే పాటలో ఒక ఆటోడ్రైవర్ భార్య అంతరంగాన్ని ఆవిష్కరించారు. 'ఆటోలు నడిపేటి డ్రైవరన్నో' అనే పాటలో ఆటో డ్రైవర్‌గా పొద్దున లేచింది మొదలు పొద్దు పోయేవరకు పడుతున్న ఇబ్బందులను బయల్పర్చారు. వచ్చిన సంపాదనంతా ఆర్.టి.ఓ ఫైన్‌కు, బండి నడవడానికి డీజిల్‌కు, మిగిలిన డబ్బులు ఫైనాన్స్‌కు కట్టంగా ఖాళీ చేతులతో కుమిలిపోయే ఆటోడ్రైవర్ అంతరంగాన్ని తెలిపారు. ఇలాంటి స్థితిగతులు మార్చడానికి, తక్కువ వడ్డీలకే లోన్‌లు ఇవ్వడానికి, డీజిల్- పెట్రోల్ ధరలు తగ్గించడానికి, పోలీసుల జులుంను అదుపులో పెట్టటానికి రచయిత సి.ఐ.టి.యు జెండా నీడలో పోరుసల్పాలని కోరుకున్నారు. 'ఆటో వాళ్ళమండి' అనే పాటలో

"అరిగినా టైరోలె బతుకులై పోయాయి
ఆటో వాళ్ళు నేడు ఆగమవుతున్నారు
ఊరుకుంటే మనల దోచుకు తింటారు.
దండు కట్టి మనం జెండాలె ఎత్తాలి"

అంటూ ఆటోడ్రైవర్లు సమైఖ్యంగా ఉంటూ సమస్యల సాధనకు కృషి చేయాలని ప్రభోదించారు. హమాలీ కార్మికుల గూర్చి 'బరువులెత్తే బాలన్నా' అనే పాటలో వ్యక్తం చేసిన తీరు కంటనీరు తెప్పిస్తుంది. హమాలీ జీవితంలో ఆటుపోట్లను తెలుపుతూ ఎందుకు కొరగాని బతుకైన విధానాన్ని తెలిపారు. వారి జీవన విధానాన్ని ఉన్నతీకరిస్తూ ఆత్మ విశ్వాసాన్ని అందించాలనే ఉద్దేశముతో

"బరువులెత్తే చేతుల్లో ఏమున్నది
బతుకును బాగు చేసే పోరున్నది"

అంటూ హమాలీలను పోరుబాట నెంచుకొని ముందుకు సాగాలని ఉపదేశమిచ్చారు. మున్సిపాలిటి కాంట్రాక్టు కార్మికుల

గూర్చి 'ఏందక్కో మున్సిపాలిటోళ్ళం' అనే పాటలో వారు రోడ్లపై చెత్త ఊడ్చిన క్రమాన్ని 'అద్దమోలె మేమంతా/ రోడ్డంతా ఊడ్చినాం' అని చనిపోయిన కుక్కలను, బిచ్చగాండ్లను ఏ ఈసడింపులు లేకుండా తీసేసి రోడ్లన్నీ శుభ్రం చేసినా కాంట్రాక్టర్లు చేసిన శ్రమ ఫలితాన్ని దోపిడి గావించుటె అని తెలుపుతూ

"ఎంతూడ్చినా.... ఎంతేడ్చినా
జీతాలు... రాకపాయె
బతుకుల్లో మార్పుకొరకు
కష్టాలు తీరనీకి
కలిసి మెలిసి పోరాడుదాం"

శ్రమ జీవులు సమస్యల సాధన కోసం సమిష్ఠిగా కలిసి పోరాడాలని నినదించారు. ఇలాంటి నేపథ్యంలోనే 'ఇండ్లల పని చేసేటి పిల్లల్ని గూర్చి, మహిళా పొదుపు సంఘాలతో పొదుపు సభ్యత్వ నమోదు చేయిస్తూ అరకొర సంపాదనతో బతుకీడుస్తున్న మహిళా పొదుపు సంఘాల సమన్వయ కర్తను 'యానిమేటరక్కా' అంటూ 'పొట్ట నిండని నీవు/ పోరు దండాలందుకోమన్నారు. 'సిపాయి కార్మికుల మండి' అనే పాటలో వారి కష్టాలను రోజువారి దినచర్యను ఆత్మాశ్రయరీతిలో వ్యక్తపరుస్తూ ఈ విధానం మారాలని- "ఇన్నేళ్ళు చేసినా కాని/ పాత చీపురు బతుకులాయె/ ఏలెటోని మెడలు వంచ/ చీపుర్లు తిరగేసి కదిలినం"

అంటూ వారి జీవన విధానంలో మార్పురావాలని ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. శ్రమజీవుల గూర్చి సున్నిత పదాలతో కర్షకుల కన్నీటి గాధలను - "నరములే తెంపావు - నారు నాటావు/ కన్నీరే పోశావు - కలుపు తీశావు/ రేయిలో నీ కళ్ళు దీపాలు జేసి/ సేల పంటలన్ని కాపలా కాసి"

చివరకు ఏమీ లాభం లేకుండా అయి, భూమి నమ్మి బువ్వలేకుండా కష్టాల పరిస్థితి అయ్యిందని వంగపండు సెలవిచ్చారు. సుద్దాల హనుమంతు రైతు గూర్చి- "రైతు బాబు రక్తంతో తడిసి/ కూలిబాబు తన చెమటన్ మెదిపి/ బలమైనట్టి భూమిని దున్ని/ బంగారు పంటలు పండించినా/ గిట్టు బాటు ధరలేక చివరకు/ పుట్టెడప్పులే మిగిలె కదన్న"

అంటూ 'ఎన్నాళ్ళీ కష్టకాలం' అనే గేయంలో రైతు దీనగాథలను వర్ణించారు. సుద్దాల హనుమంతు, వంగపండు వరప్రసాదరావు పాటల్లో శ్రమ జీవులను భుజానికెత్తుకున్న విధానం ఎలా ఉందో స్ఫూర్తి పాటల్లో కూడా అలాంటి విధానమే కనిపిస్తుంది. 'అన్నదాతల బతుకు నేడు' అనే పాటలో స్ఫూర్తి - "కోడి కూతకు ముందే లేచి/ ఎడ్ల నిప్పి కుడితి పెట్టి/ కర్రు నాగలి పట్టుకొని/ అరక గట్టి దుక్కి దున్ని/ ఆశతోటి నాట్లు వేశారో... మా రైతన్నలు

సెమట సుక్కల నీళ్ళు పెట్టారో... రైతన్నలు"

అని వ్యక్తపరుస్తూ చివరి చరణంలో - కోత కోసి కుప్పపెట్టి/ బంతి తిప్పి రాశి పోస్తే/ అమ్మబోతె అడ్తిదారులు/ ధరలు మొత్తం దించినారు/ గిట్టుబాటు ధరల కోసమురో రైతన్నలు

రైతు జెండతో దండు నడుపన్నో మా అన్నలు" అని తెలిపిన ఈ పాటలు కాలం దశాబ్దాలు, శతాబ్దాలు మారినా కార్మికుల, కర్షకుల జీవన విధానాలు, కష్టాల కడగండ్లు మారలేదనే వాస్తవాన్ని సమాజ గతుల్ని వ్యక్తపరుస్తున్నాయి. రాజరికాలు ఏలిన కాలంలో రాజులు, సామంత రాజులు; భూస్వాముల పాలనలో పటేల్, పట్వారీలు, దొరలు; నేటి కాలంలో అడ్తీ వ్యాపారులు, మార్కెట్ దళారులు రైతు కష్టాన్ని నిలువునా దోపిడి చేస్తున్నారని తెలుస్తున్నది. శ్రామికుల అంతరంగాన్ని వ్యక్తీకరించి, వారిలో ఆశావాద భావన నాటడానికి, అభ్యుదయ భావాల్ని రగిలింపచేయడానికి పూర్వ కవులు ఎంత కృషి చేశారో ఆ ప్రభావంలోంచి వచ్చిన స్ఫూర్తి రచనల్లో కూడా అదే ఆవేశం కనబడుతున్నది. వంగపండు కార్మికుల కంఠాలన్నింటినీ ఏకం చేసి అడుగుతూ- "పంచభక్ష పరమాన్నం నీకా/ ఉప్పులేని గంజినీల్లు మాకా/ రాత్రిపగలు జేసింది మేమా/ రాజులాగ కులికింది నీవా"

అని ధిక్కార స్వరాన్ని వినిపిస్తే, స్ఫూర్తి అదే ఆవేశం, శ్రామిక వర్గ ప్రజలకు అండగా ఉండే స్వభావ చింతనతో, పీడిత వర్గం పైన దుమ్మెత్తి పోసే ఆలోచనా సరళిలో- "మా చెమటలు చిందె/ వారి లాభం పెరిగే/ మా కష్టం తోటి/ వారు కోట్లకు ఎదిగె/ గుండె గుండెను కలిపి/ ఎర్ర జెండాలవుతం/ సైరనూ దుతున్నం/ పోరుకు సై అంటున్నం"

అని పోరుకు సై అంటున్న కష్టజీవుల అంతరంగాన్ని స్పృశించారు. జీవిత ప్రయాణంలో మార్క్సిస్ట్ భావజాలానికి ప్రభావితుడై పాటల్లో మనుషుల్ని వారి కష్టాల్ని ప్రధానంగా చేసుకొని ముందుకు సాగుతున్న పాటల శ్రామికుడు స్ఫూర్తి. అతని పాటల్లో దోపిడి చేసే వర్గం నుండి దోపిడి గావించబడే శ్రామిక వర్గం రక్షించబడాలని కోరుకున్నారు. ఈ నేపథ్యంలో అనేకనేక పాటలు రాశారు. అతని పాటల్లో వివిధ కులవృత్తులైన చేనేత, క్షౌర, జౌళి, కుమ్మరి, మత్స్య, దర్జీ, రజక అవుసలి, కల్లుగీత, గొర్రె-మేకల కాపరుల గూర్చి వృత్తిదారు గీతాలు, రైతు గీతాలు, కార్మిక గీతాలు, దళితులపైన గీతాలు, పోలవరం ప్రాజెక్టు వ్యతిరేక గీతాలు, రాజకీయ అభ్యుదయ గీతాలు, ముదిగొండ పైన గీతాలు, మెదక్ జిల్లా సమస్యల పైన గీతాలు, మత సామరస్యం, భద్రత, పర్యావరణం, అంగవైకల్యం కలిగిన వారిపైన గీతాలు... ఇంకా వివిధ అంశాల పైన తనదైన శైలిలో పాటను రక్తి కట్టించారు.



# 'కొవ్వలి' నవలల్లోని 'స్త్రీ'




కొవ్వలి వారి వెయ్యి నవలలు వ్రాసిన, ఆనాడు **1940** నాటి నుంచి ఉన్న సామాజిక నేపథ్యంలోని ఇతివృత్తాలనే, ఆలంబనగా చేసుకొని, తన చుట్టూ ఉన్న సమాజంలోని వ్యక్తుల చిత్త ప్రవృత్తులను, కేంద్ర బిందువుగా 'స్త్రీ' పాత్రలుగా చేసుకొని, తన అన్ని నవలలనూ తీర్చిదిద్దినారు.

కేవలం స్త్రీ పాత్రల మనో వికాసపు, చైతన్య దీపికలుగా మొదటి నవల 'పల్లెపడుచు'తోనే కలం సంధించిన స్త్రీ పక్షపాతి కొవ్వలి.

లింగాల రామతీర్థ
**9866262829**

కొవ్వలి లక్ష్మీ నరసింహారావు '1001' నవలలు వ్రాశారు. ఇవి 1935 సం॥రంలోని 'పల్లెపడుచు' లగాయతు 1975 తన ఆఖరి నవల 'కవి భృమన్న' దాకా ఉన్న వెయ్యి ఒక్క నవలలు. తెలుగు నవలా సాహిత్యంలోనే కాక, ప్రపంచ నవలా సాహిత్యంలో ఇంకెవ్వరు ఇన్ని నవలలు వ్రాయలేరు. 'న భూతో న భవిష్యతి'! గా ఈయన పేరు గిన్నిస్ బుక్ రికార్డ్‌కు ఎక్కాలి.

కాని కొవ్వలి వారు అత్యంత నిరాడంబర జీవితాన్ని గడిపిన నవలా కారుడు.

కొవ్వలి వారు 1912లో ప॥గో॥జిల్లా తణుకులో పుట్టారు. రాజమండ్రిలో తండ్రి ప్లీడర్ దగ్గర గుమస్తాగిరి చేస్తూ స్థిరపడ్డారు.

ఈయన విద్యాభ్యాసం అంతా స్కూల్ ఫైనల్ దాకా రాజమండ్రిలోనే పూర్తిచేశారు.

ఆది కవి నన్నయ్య మొదలుకొని సామాజిక 'యుగకర్త' కందుకూరి వీరేశలింగం గారి లాంటి సాహిత్య సేవకులకు, ద్రష్టలకు పుట్టినిల్లు అయిన గోదావరి తీరం. అందులో వెలసిన గ్రంథాలయాలనన్నీ ఔపోసన పట్టిన భాషాభిమాని. వచన కారుడు కొవ్వలి.

కొవ్వలి వారి వెయ్యి నవలలు వ్రాసిన, ఆనాడు 1940 నాటి నుంచి ఉన్న సామాజిక నేపథ్యంలోని ఇతివృత్తాలనే, ఆలంబనగా చేసుకొని, తన చుట్టూ ఉన్న సమాజంలోని వ్యక్తుల చిత్త ప్రవృత్తులను, కేంద్ర బిందువుగా 'స్త్రీ' పాత్రలుగా చేసుకొని, తన అన్ని నవలలనూ తీర్చిదిద్దినారు.

కేవలం స్త్రీ పాత్రల మనో వికాసపు, చైతన్య దీపికలుగా మొదటి నవల 'పల్లెపడుచు'తోనే కలం సంధించిన స్త్రీ పక్షపాతి కొవ్వలి. తన తల్లిగార్కి అంకితమిచ్చారు.

ఈ నవలలో ఆర్థిక- సామాజిక- సంఘసంస్కరణ కోణాలలో స్త్రీ పాత్రకు ప్రాతినిధ్యాన్ని సంఘానికి, వ్యవస్థకి ఎంత అవసరమో తేల్చారు.

ఏటుకూరి ప్రసాద్ కూర్చిన 'కొవ్వలి నవలలు కొన్ని' అనే పేరుతో ముద్రించిన 'నవలా సంపుటిపై నేను యం.ఫిల్. సిద్ధాంతీకరణ చేశాను. తెలుగు విశ్వవిద్యాలయం నుంచి ఇప్పుడు కొవ్వలి నవలల్లోని 'స్త్రీ' పాత్రల విశ్లేషణపై బెంగుళూరు విశ్వవిద్యాలయం నుంచి పి. హెచ్.డి, పరిశోధనాంశంగా చేసుకొని పూర్తి చేస్తున్నాను.

కొవ్వలి వారి అన్ని నవలల్లో స్త్రీ పాత్రలే కేంద్ర బిందువుగా, పురుష పాత్రల మనో చిత్తములు, వారి సంస్కారములు, ఆనాటి సామాజికాంశాలకు ప్రతిబింబాలుగా తీర్చిదిద్దారు.

అందునా గిడుగువారి వ్యవహారిక వచన భాష ప్రయోగానికి నిలువెత్తు ఏకలవ్య శిష్యుడు కొవ్వలివారు. సామాన్యునికి అర్థమయ్యే వ్యవహారిక భాషలోనే, అవి అతి తక్కువ వెలకు

ప్రచురణా సంస్థలు తన నవలలను ప్రచురించేలా ఒప్పందం చేసుకొన్న వచన భాషోద్ధారకుడు.

ఆ రోజుల్లో 1940-1970 దశకాలలో సంప్రదాయ వాదులకు ఇద్దరిమీదే ఆంక్షలు వారే కొవ్వలి - చలం గార్లు.

ఆనాడు కొవ్వలి నవలలు చదవని స్త్రీ లేదేమో! అన్నంతగా మధ్య తరగతే కాదు అన్ని వర్గాల స్త్రీలు కొవ్వలి వారి నవలలకు వీరాభిమానులే.



ఇది చలం ప్రశంసలోనే చెప్పాలంటే "ఒక కాలమున తెలుగుదేశమున కొవ్వలి నవలలు కౌగిటిలో లేని స్త్రీ లేదు!" అని చలంగారే కొవ్వలి నవలలపై స్త్రీలకు ఎంతటి క్రేజ్ ఉండేదో ప్రత్యక్ష సాక్షిగా వెల్లడించారు.

కొవ్వలి నవలలు వ్రాసే నాటికే స్త్రీ వాదిగా అత్యుత్తమ నవలా కారులుగా 'చలం', - విశ్వనాథ - అడివి బాపిరాజు త్రయం ఉర్రూతులూగుతున్న కాలం.

ఆ రోజుల్లో 1940-1970 దశకాలలో సంప్రదాయ వాదులకు ఇద్దరిమీదే ఆంక్షలు వారే కొవ్వలి - చలం గార్లు.

ఆనాడు కొవ్వలి నవలలు చదవని స్త్రీ లేదేమో! అన్నంతగా మధ్య తరగతే కాదు అన్ని వర్గాల స్త్రీలు కొవ్వలి వారి నవలలకు వీరాభిమానులే.

ముఖ్యంగా కందుకూరి వారి స్త్రీ జనోద్ధరణ, చిలకమర్తి వారి సాహిత్య సేవాతత్పరత కొవ్వలి వారి జీవితానికి ప్రేరణ అయినప్పటికి వారికిమించిన వచన నవలా కారుడిగా మానసచోరుడిగా, స్త్రీ పక్షపాతిగా కొవ్వలి నవలలు అత్యంత ప్రజాదరణ నోచుకొన్నాయి.

'పండగ మామూలు' నవలలో 'అరవింద' పాత్ర ద్వారా చదువుకొన్న 'స్త్రీ'గా తన వ్యక్తిగత అభిప్రాయాలకు తన విద్యార్జన ఎలా విచక్షణకు తోడ్పడిందో, ఎలాంటి నిర్ణయాధికారాన్ని, తన జీవిత లక్ష్యంపై గురిపెట్టిందో, తను ప్రేమించిన రామాన్ని కులాంతర వివాహానికి ఎలా పెద్దలను వారి కుల కట్టుబాట్లును ఎదిరించి, కన్నతండ్రి తనపై హత్యాయత్నం ఒడిగట్టినా, గాంధేయవాద సిద్ధాంతాన్ని అవలంభించి సమాజానికి 'స్త్రీ'కి విద్య ఉంటే ఎలాంటి విచక్షణా జ్ఞానాన్ని సమాజానికి పంచిపెట్టవచ్చో ప్రకటింపచేసిన సంస్కరణాభిలాషి కొవ్వలి.

అట్లే 'ఆషక్' నవలల్లో 'రింగ్' అనే హాస్య పాత్రలో తమకి ఓ మనస్సుంటుందని, మనస్సు చంపుకొని ఏ వృత్తి కొనసాగించకూడదని, తమకి ప్రేమతో కూడిన నిజాయితీ గల జీవితం, అనుభవించాలనే ఆకాంక్షను ఆ పాత్ర ద్వారా సమాజానికి నిరూపించారు.

'జాతి కొద్దీ గుణములుండవని, 'బుద్ధులుండవని' తను ప్రేమించిన యువకునితో యాచకవృత్తినే ఎంచుకొని, వృద్ధ వేశ్య ఎరచూపిన ఆభరణాలను ఆస్తిని త్రోసి రాజన్ని 'ప్రేమ శీలి'గా తీర్చిదిద్దారు కొవ్వలి. అట్లే 'భామాకలాపం'తో 'పోలి' పాత్ర మధ్యతరగతి 'స్త్రీ'ల వ్యాకులతకు, 'కన్యాశుల్కంతో' తన తండ్రి పడ్డ అవమానకర జీవితాల నేపథ్యంలో తను నేర్చుకొన్న కళకు సార్థకత చేకూర్చి, తిరిగి తన భర్తను పొందిన విధం, 'కళాజిజ్ఞాస' మనిషి జీవన మనుగడకు ఎలా దోహదపడుతుందో సమాజానికి తెలియపర్చారు. 'పగటి వేషం' నవల ద్వారా.

'రావుబహుద్దూర్' నవలలో బాల్య వితంతువైన 'వాసవి' ఆధునికత మేళవించుకొన్న నాగరిక జీవనాన్ని స్వాగతిస్తూ తన భావైన 'విశ్వేస్'ను తండ్రి చాంధస వాదాన్ని ఎదిరించి ఆయన్ని వివాహం చేసుకొన్నదిగా తీర్చిదిద్దారు కొవ్వలి.

'భగవతి - భారతి' నవల ద్వారా భర్త వదిలేసిన 'స్త్రీ'ని సమాజం ఎలాంటి కవ్వింపు చర్యలకు, అఘాయిత్యాలకు ఉసుగొల్పుతుందో, చిత్రిస్తూ, ఎలాంటి అవాంతరాలు, అవమానాలు ఎదురైన తన 'శీల సంపత్తిని' కాపాడు కొంటూ దుష్ట సమాజాన్ని ఎదుర్కొన్ని తిరిగి తన భర్తను సంసారాన్ని నిలుపుకొన్న హైందవ యువతిగా ధర్మా - ధర్మ - విచక్షణతో 'స్త్రీ అబల కాదు సబల' అని నిరూపించారు.

'లక్షాధికారి' నవల ద్వారా ఉన్న బాంధవ్యాన్ని తెగ తెంచడానికి లేని సంబంధాన్ని కల్పించడానికి సిరిసంపదలు మనుషుల జీవితంతో ఎలా ఆడుకుంటాయో తెలియచెప్తూ తను ప్రేమించిన విద్యాధికుడైన రాఘవనే పెళ్ళిచేసుకొన్న 'అమ్మన్న' లాంటి మధ్యతరగతి యువతిని 'పెళ్ళిచూపు' నవలలో 'భాగ్యవతి' పాత్ర తన తల్లిదండ్రుల ఆర్థిక స్థితిని ఏమార్చి, మృగతుల్యుడైన భర్తను, మామగారి ఆరళ్ళను తట్టుకోలేక, విధి వంచితై, ఆత్మాహుతి చేసుకొన్న ఆత్మాభిమానిగా 'భాగ్యవతి'ని తీర్చిదిద్దారు 'కొవ్వలి'

వరకట్నానికి అభాగినుల జీవితాలు ఎలా బలైపోయాయో మన కళ్ళ ముందు ప్రత్యక్షంచేసి, సమాజాన్ని ఆలోచింపచేశారు ఆరోజుల్లోనే.

'గంగాబాయి - యమునాబాయి' లాంటి అప్పాచెల్లెల్లు తమ వయోభేద వివాహాలతో విసిగిపోయి, తమను ప్రేమించిన ప్రియులతోనే పునర్ జీవితాన్ని, పునర్వివాహాన్ని స్వాగతించిన

'లంబోదరం' నవల కొవ్వలి నవ్యనాగరిక సమాజ కాంక్షకు నిదర్శనం.

'చుప్పనాతి' నవలలో 'సఖి' లాంటి యువతి తనకు కాని దాన్ని ఆశించి, పరాయి సంసారాలను కూలదొయ్యాలని చూచినా, తన జీవితం ఎలా నాశనం చేసుకొందో 'స్త్రీల' విపరీత బుద్ధులకు ప్రతీకగా తీర్చిదిద్దాయి.

'బ్రతకడమెందుకు', 'షోగ్గాడు', నవలల్లోని స్త్రీ పాత్రలు కూడా తను విచక్షణా జీవితానికి ప్రతీకలుగా చిత్రించారు. 'తప్పేముంది?' నవలల్లో తన భర్త వీర్రాజు తన్ను కాదని 'పనిమనిషిని' మరిగాడని, పూర్ణ కూడా పనివాడితో అక్రమ సంబంధం నెరపి, భర్తకు సిగ్గొచ్చేలా చేసి, సమాజాన్ని నిలదీసి తను చేసింది 'తప్పేముంది!' అని మొగాడికో నీతి! ఆడదానికో నీతినా అని ప్రశ్నించేలా వారి వారి సంసారాలను తిరిగి చక్కదిద్దుకొనేలా కొవ్వలి సమస్యలకు పరిష్కారాలను తేల్చి చూపారు.

అమాయకపు మొగుణ్ణి బుట్టలో వేసుకొని అక్రమ సంబంధాన్ని నెరుపుతున్న 'చిత్రాంగి' లాంటి స్త్రీని ఊర్లో వారిచే భర్త పట్టించి, గాడిద మీద కూర్చోబెట్టి సమాజంలో మరే స్త్రీ, ఇలాంటి మోసాలకు పాల్పడకుండా ఉండేలా గుణపాఠం చెప్పించారు 'మోసపు భార్య' నవలలో కొవ్వలి.

అలాగే ఆయన నవల లన్నిటికి పెట్టే పేర్లు. ఒకదాని కొకటి విభిన్నంగా, కథనానికి సరిపోయే పేర్లనే ఎంపిక చేసుకొంటూ వెయ్యి నవలలు పూరించారు

భూలోకంలో వ్యభిచారం పెరగడానికి, వయో రూపగుణాలు గలిగిన భర్త లభించకపోవడం, స్త్రీలు పక్కదారులు తొక్కుతున్నారనే విషయం. దేవేంద్రుడు భూలోకానికి యముణ్ణి పంపి విషయాలు సేకరింపచేసి, 'ఏడాది పుస్తి' నవల ద్వారా సోషియో ఫాంటసీ తరహా కథనంతో ఇష్టం లేకపోతే భర్తను మార్చుకొనే పద్ధతిని ప్రవేశపెట్టడం చూపారు.

'బీచ్‌లో హత్య'లో కూడా చదువుకొన్న విద్యావంతులు ప్రేమ పేరుతో, ఆర్థిక స్థితి నేపథ్యంలో ప్రేమించే వాడిని కూడా ఏమార్చి, వేరే అక్రమ సంబంధానికి వెనకాడని 'శబి' లాంటి స్త్రీ పాత్రను చివరకు నిజాయితీ గల ప్రేమకు ఎలా ఒదిగిందో నిరూపించారు.

హియర్! హియర్! నవలలో కూడా ఎంతటి విద్యా సంపన్నులై, ఉన్నతస్థానంలో ఉన్నవారైనా అనుమానపు ఛ్ఛాయలతో భార్యలను అనుమానించి తమ సంసారాలను ఎలా ఇరకాటపు స్థితికి తెచ్చుకొంటారో! వాటిని తమకున్న కళాత్మక హృదయంతో, చక్కటి సహన సంస్కారంతో తమ సంసారాలను ఎలా హుందాగా చక్కదిద్దుకోవచ్చో చాలా సున్నితంగా స్త్రీ పాత్రలను- పురుష అహంకార పాత్రలను తన నవలల్లో తీర్చిదిద్దారు కొవ్వలి.

అలాగే ఆయన నవల లన్నిటికి పెట్టే పేర్లు. ఒకదాని కొకటి విభిన్నంగా, కథనానికి సరిపోయే పేర్లనే ఎంపిక చేసుకొంటూ వెయ్యి నవలలు పూరించారు కొవ్వలి.

"రూపవతి', 'ఇల్లాలు', 'డాక్టర్ వైఫ్', 'దేవసాని', 'నీవేనా భార్యవు - నీవేనా భర్తవు', 'సవతి పోరు', 'సాని సంపర్కం', 'స్త్రీ శక్తి', 'దైవమిచ్చిన భర్త', 'కోడంటికము', 'గంగా - యమున - సరస్వతి' 'ఇంతి - పూబంతి - చామంతి' లాంటి నవలలు ప్రజాదరణ పొందాయంటే, కొవ్వలి నవలా వచన ప్రక్రియ అంత సునిశితమైనది. విభిన్నమైనవి.

'జాగజ్జాణ' 'విషకన్య' లాంటి డిటెక్టివ్, సాహసోపేత స్త్రీ కథానాయిక నవలలను కొన్ని వారాలపాటు అనేక పత్రికలలో 1940, 50, 60 దశకాలలోనే అన్ని వర్గాల 'స్త్రీ' పాఠకులను 'భయంకర రాణి' కలం పేర్లుతో తన వినూత్న రచనా శైలితో కట్టిపడేసిన వచన నవలా బోధకుడు కొవ్వలి వారు.

ఆనాటి 'స్త్రీ విద్య' 'పునర్వివాహాల సమర్ధన', 'వేశ్యా వృత్తి ఖండన' 'అక్రమసంబంధాలను' ఖండిస్తూ, 'స్త్రీ మనోవికాసాలను కోరుతూ, తన నవలా రచనను కొనసాగించిన యోధుడు.

తన సహచర, సమకాలీన నవలాకారులగు త్రిపురనేని గోపీచెంద్, కొడవటి గంటి కుటుంబరావు, బుచ్చిబాబు గారి కంటే కూడా విభిన్నశైలీ, కథనాంశాలతో నవలా కారుడుగా అత్యంత పాఠక హృదయచోదకుడుగా, తెలుగువారి ఆదరణకు పాత్రుడైన 'వచన శిల్పి' కొవ్వలి.

వెయ్యో నవల (1000) 'మంత్రాలయ' నవలను ఆధ్యాత్మిక నవలగా తీర్చిదిద్ది, హాస్య మహానటి సూర్యాకాంతం గారికి అంకితమిచ్చారు. ఇది నటుడు రాజబాబుగారి చేతుల మీదుగా జరిగింది.

1001 నవల 'కవిభీమన్న'ను తన భార్య లక్ష్మీదేవిగార్కి అంకితమిచ్చారు కొవ్వలి. 1975లో చివరి శ్వాస తీసుకున్నారు.

నటి కన్నాంబగారి స్వంతబ్యానర్ 'రాజారాజేశ్వరి ఫిలింస్'పై ఆవిడ భర్త కదారు నాగభూషణం గారి పిలుపు నందుకొని చిత్రరంగ ప్రవేశం చేసి వాని 'తల్లిప్రేమ', 'దక్షయజ్ఞం' లాంటి సినిమాలకు 'కథ - మాటలు' కూడా అందించిన సవ్యసాచి కొవ్వలి.

నటుడు కైకాల సత్యనారాయణ కథానాయకుడుగా చేసిన 'సిపాయి కూతురు' సినిమాను డి.ఎల్.నారాయణ నిర్మాతగా మారి, ఈ సినిమాకు కథ-మాటలు వ్రాయించారు.

## ఇష్టం!

- కె. విల్సన్‌రావు
8985435515



ఎదుగుతున్న పచ్చని మొక్కన్నా
విచ్చుకుంటున్న పూ మొగ్గన్నా
శీతాకాలపు మంచు ముత్యమన్నా
కిటికీ లోంచి సుతారంగా తాకే
శీతగాలి అన్నా నాకెంతో ఇష్టం -

ఒండ్రు మట్టిని వంటినిండా పూసుకుని
స్వేచ్ఛగా ఆడుకుంటున్న రేపటి తరం
మొండిమొల పోరగాళ్ళంటే ఎక్కడలేని ఇష్టం -

పరికిణీలు పైకెగ్గట్టి
తంగెడు పూలు తలలో తురుముకుని
పొలం గట్లెంట చెంగు చెంగున
గంతులేసే కుర్రకారంటే ఇంకా ఇష్టం -

ప్రశ్నించే తత్వమున్న
స్వాప్నికుడ్ని కలగనటం ఇష్టం
వెతుకులాటలో దొరికిన
ముత్యమంటి మంచి పద్యమంటే ఇష్టం -

పాలెగాళ్ళను ప్రశ్నించిన నేరానికి
అమరులైన నేస్తాల అమరత్వాన్ని
గొంతెత్తి గానం చేస్తూ
పాటల్ని ఈటెలుగా విసిరే
పాటగాళ్ళంటే మరీ ఇష్టం
వాళ్ళను కన్న తల్లులంటే మరీ మరీ ఇష్టం!

---

కొవ్వలి వారికి 'హాస్యబ్రహ్మ' భమిడిపాటి కామేశ్వర రావుగారు స్వయంగా గురుతుల్యులు.

మొదటి నవల 'పల్లెపడుచు'కు జాతీయోద్యమ శీలి గరిమెళ్ళ సత్యనారాయణ ముందుమాట వ్రాసి ఆశీస్సులందించారు. అట్లే రెండో నవల 'దాసీ పిల్ల'కు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిచే ముందుమాట వ్రాయించి, ఈయన చేతిన 'వచన భాష' సామాన్యులకు అందుబాటులో ఉండేలా 'వ్యవహారికభాషా వాదాన్ని' సమర్థించారు.

కాబట్టే 'వ్యవహారిక వచన భాషోద్ధారకుడిగా 'నవలా చక్రవర్తి'గా తెలుగు నవలా సాహిత్యంలో కొవ్వలి చిరస్థాయిగా వెలుగొందారు.

ఇలా తన నవలల్ని ఆ రోజుల్లో తెలుగునాట బస్టాండుల్లోకి, రైల్వే కంపార్ట్‌మెంట్‌ల్లోకి, వంటిల్లుల్లోకి తోల్కువచ్చిన నవలా చోదకుడు కొవ్వలి.

ప్రముఖ నటీమణి భానుమతి చెప్పినట్లు 'మా రోజుల్లో కొవ్వలి వారి నవలలు చదువుతూ పాఠకులం తాము దిగవలసిన రైల్వేస్టేషన్లను మరచి పోయి, వారి నవలల్లో నిమగ్నులైపోయేలా చేసిన ధన్యజీవి, 'నవలా చక్రవర్తి' కొవ్వలి వారని ప్రశంసించారు.

అట్లే బి.ఎస్.రెడ్డి, దాశరథి, సినీగాయకులు పి.బి.శ్రీనివాస్ 'నవలల తాత మా కొవ్వలి' అని పొగిడేవారు.

ఆచార్య తమ్మావఝల కోదండరామపంతులు లాంటి భాషావాదులు సైతం, సాహిత్య కోవిదులెందరో కొవ్వలి వారి షష్ఠ్యబ్ది ఉత్సవానికి ఆశీస్సులందించారు. వేంకటేశ్వరా, మద్రాస్ విశ్వవిద్యాలయాలు ఈయన నవలారచనా - సాహిత్య సేవకు మెచ్చుకొని ప్రశంసా పత్రాలతో గౌరవించాయి.

ఇలా ఆనాటి స్త్రీల స్థితిగతులపై, స్త్రీల జీవిత వికాసానికి తన నవలా రచనను వేదిక చేసుకొన్న స్త్రీ పక్షపాతి కొవ్వలి వారు- చలంగారు తన నవలల్లో కోరుకున్న స్త్రీ స్వేచ్ఛా జీవన సౌందర్యాన్ని కాంక్షిస్తూనే, ఇది సమాజానికి సహేతుకంగా స్త్రీ జీవిత మనోవికాసాలకు, తమ తర్వాతి తరానికి ఆదర్శంగా ఉండేలా ఆయా పాత్రలను తీర్చిదిద్దిన సంఘ సంస్కార స్వగతుడు 'వెయ్యి నవలల కొవ్వలి' అని విమర్శకులచే ప్రశంసలు పొందారు!

పండిత భాష అర్థంకాని రోజులలో, సామాన్యులకు అర్థమయ్యే వ్యవహారిక భాషలో తన నవలలన్నింటినీ వెలయించిన కొవ్వలి "తెలుగు సాహిత్య వనంలో ఎన్నడూ వాడని కుసుమం" అని పద్మశ్రీ డా॥ తుర్లపాటి కుటుంబరావు గారి ప్రశంస, ప్రపంచ నయా సాహిత్యానికీ మణిమకుటమని, శత - సహస్ర వందనాలు అర్పించుకోవల్సిందే! మరి మన తెలుగుజాతి కొవ్వలి వారికి.



కథ

- చక్రపాణి నోముల
9052011145



# జూబిలీ బిచ్చగాళ్ళు

**జూబిలీ హిల్స్ పై వింత వింత బిల్డింగులు తెల్లారగట్ట పొడుసుకొచ్చిన పుట్టగొడుగుల్లా తేటగ నిగనిగ లాడుతున్నాయి. తీర్చిదిద్దిన పేవ్‌మెంట్లు కడిగినట్లు తారురోడ్లు, ఎత్తైన ప్రహరీగోడలతో అక్కడంతా దర్జాగా ఉంది. ఓ గేటు ముందుకు బైకు మీద వచ్చినతనికి శాల్యూట్ కొట్టి లోపలికి వెళ్ళనిచ్చాడు సెక్యూరిటీ అతను. లోపల పూలమొక్కల మధ్య పెద్ద కత్తెర చేతపట్టి క్రోటన్ అంచులను సవరిస్తున్నాడు మాలి.**

బైకు పై వచ్చిన అతను ఆ భవంతి మెట్లు ఎక్కుతుంటే ఇల్లు దద్దరిల్లేలా 'భౌ భౌ'... అని అరుస్తూ స్తంభానికి కట్టేసిన మెడ గొలుసును తెంచుకోవాలని వీరంగమెత్తుతోంది ఓ వింత ముఖం కుక్క.

హడావిడిగా మెలికలు తిరుగుతూ వచ్చింది పనిమనిషి 'కాంపౌండరు సారూ రండి రండి, హాల్ల చిన్న దొరసాని గెస్టులున్నారు ఈ పక్క వరండాలకెళ్ళి పోదాం రండి' దర్బారులో రాణుల్లా కొలువుదీరి కబుర్లు చెప్పుకుంటున్నారు. స్ప్రే వాసన గుప్పుమంటోంది. 'ఎమ్మెల్యేగారి మేడం గారొచ్చింరు, వాళ్ళబిడ్డ లగ్గం కదా సారూ సాపింగుకు వెళ్తున్నారు.. అందుకే మిమ్మల్ని ఇట్ల తీసుకపోతున్న, సారూ పెద్ద దొరసాని నిన్న బాగా సికాకు చేసింది, చిన్న దొరసానికి కోపమొచ్చి ఈ కొన గదిలకు మార్పిచ్చింరు అప్పన్నించి అందర్నీ తిడుతున్నది, ఇగో నా చెంపలు వాయ కొట్టింది.' వరండా చివరి గది తలుపు తట్టి 'పెద్ద దొరసానీ కాంపౌండర్ ఒచ్చింరు, సారూ అవసరముంటే పిలువుండి' అంటూ జారుకుంది.

'ఎవరూ క్రిస్టోఫర్ నువ్వేనా'

అవును క్రిస్టోఫర్ నే అమ్మగారు 'నవ్వాడు'

'క్రిష్టా, క్రీస్తూ అని పేరు పెడ్తే దేవుళ్ళైపోరురా మనిషిలాగా ఉంటే చాలు ఇంగ నువ్వైతే మంచోనివరా ఇప్పుడు నువ్వే నాకు దిక్కు చూసినవా క్రిస్టోఫర్, ఆఖరికి నా బతుకు ఎట్లైందో, నేను నా కమరాల ఉండొద్దట. నా కోడలు దొరసానికి ఆమె దోస్తులొచ్చినప్పుడు నా ముసలి ముఖం ముడతల ముఖం చూసి చికాకు పడ్తున్నరట, నిన్న పత్రిక ఇయ్యటానికి మినిస్టర్ పెళ్ళాం గ్యాంగు వొచ్చిన్రు, వాళ్ళు ముచ్చట్లు పెట్టి పోయేదాకా నన్ను రూములబెట్టి బేడం పెట్టింది, ఇంగో ఇయాల దూరంగ ఈమూల గదిలకు పారేసిన్రు. ఇంగ ఇదీ దీని మినిష్టర్ దోస్తులు నాలాగ ముసులోల్లు గారా. వాళ్ళ మోకాల్చిప్పలు అరగవా..

"అమ్మగారూ అవన్నీ పట్టిచ్చుకోవద్దు మందులు వాడి బలంగా తయారుకాండి' ఇంజెక్షన్ తయారు చేస్తున్నాడు.

'ఈ సూది ఒక్కసారే సురుక్కుమంటది, దాని దెప్పిపొడుపులు తెల్లార్లు గుచ్చుకుంటయి రా'

'మునుపటి కంటే నయమే కదా మళ్ళీ మామూలుగా అవుతరులెండి..'

'కానురా నా బతుకింతే, వద్దన్నా ఇనకుండా నా మోకాళ్ళు ఊడబీకి మాయదారి కీళ్ళు పెట్టింరు బొక్కలన్నీ చీకిపోయినయంట, కదిలితే వుటుక్కుమనేటట్టున్నయి పానంబోతాంది, షుగరు బీపీ బేజారైతాందిరా... ఈ ఏకాకి బతుకు నాకొద్దురా సచ్చిపోత నా పీడ పోతది నాకీ కష్టాలు దప్పుతయి, నేనడిగింది తెచ్చినవా ఎన్నిసార్లడిగినా కనికరం పుడ్తలే నీకు..'

'అమ్మగారు, ఏ దిక్కులేని కుంటోళ్ళు గుడ్డోల్లు డొక్కలు చేతపట్టి రోడ్లవెంట అడుక్కుంట, బతకాలనే ఆరాట పడుతరు మీకేం తక్కువ'

'అన్నీ ఉన్నా దిక్కులేని దాన్నిరా... ఎందుకు బతికి దండగ... నా కోడలు నామొఖం సూడదు నా కొడుకు పదిరోజులకొకసారి గలమట్లనించే తొంగిచూసుకుంట యెందే నీ కోడలితో పంచాతిలెందుకు చేస్తున్నవు, క్రిష్ణా రామా అనుకుంట మూలకు పడుండక ముసల్దానా అని తిట్టటానికి మందలిచ్చి పోతడు, నా మనవలు యెక్కడో సదువుతరు, తాతలనాటి భూమి ఈ కొడుకు రాపిచ్చుకొని కోట్లకు అయిండని ఒక్కగానొక్క బిడ్డని రానిస్తలేదు అల్లుడు, మంచం దిగాలన్నా ఒక్క దానికి దిగొస్తలేదు, నిద్రకు గోలీలు, నిద్ర మత్తు పోవటానికి గోలీలు, పొద్దుమాపులు మింగలేక చస్తున్నరా. దిక్కులేని బతుకు, పుట్టుక్కున సచ్చేదేదన్న గింత విషం ఇయ్యి నీకు నా గొలుసిస్తరా..



'సరేగని మెత్త కింద యేమో దాచుకున్నరు' అంటూ మెత్తలేపి ఇంజెక్షను బుడ్డిని కోసే చిన్న బ్లేడ్లు, పండ్లు కోసే కత్తి తీశాడు 'యెందుకివన్ని'

'సీరియల్లో కోడలుపెట్టే బాదలు పడలేక నా లాంటి అత్త ఆఖరికి మణికట్టు నరాలని కోసుకుంటది... రక్తం కారుతుంటే హాయిగ కళ్ళు మూసుకుంటది'

'రక్తమంతాపోయి చనిపోతుందా'

'ఆహా... చావదురా... పనిమనిషి చూసి కేకలుపెడ్తది, కొడుకు గుండెలు బాదుకుంట అమ్మా.. అమ్మా నువుచావొద్దే అని పెద్దపెద్ద డాక్టర్లకి సూపెడ్తడు. ఏడ్చుకుంట కాళ్ళు మొక్కుతడు... పెళ్ళాన్ని చెంపలు వాయకొడ్తడు, అత్తగారు అని కాళ్ళమీదపడ్తది, ఆఖరికి అందరికి బుద్ధి వస్తది... పువ్వుళ్ళ పెట్టి చూసుకుంటరు'

'మరి మీరూ నరాలు కోసుకోవాలనుకుంటున్నారా'

'ధైర్యం వస్త లేదురా రక్తమంటే నాకు భయం చిన్నప్పుడు కోళ్ళు కోస్తుంటేనే నేను లోపల దాక్కునేదాన్ని. పుటుక్కున సచ్చే దేదన్న ఇయ్యిరా.'

'అమ్మగారు ఇంతకుముందు తోటమాలితో గన్నేరు కాయలు తెప్పిచ్చుకున్నరట ఆ సంగతి మీ వోళ్ళకు తెలిసి, ఆ మాలిని మళ్ళా లేవకుండా బొక్కలిరగ కొట్టిన్రట కద. మరి నేను మీకు విషమిస్తే నన్ను బతకనిస్తారా'

'గన్నేరు కటిక చేదురా, మింగుడుపడలే, దేవుని మీద ఒట్టు యెవ్వరికీ చెప్పబతుకుమీద తీపి పోయిందిరా తియ్యటి విషమియ్యి, నవ్వరించుకుంట చస్తరా.. కావాలంటే గొలుసుతోపాటే నా గాజులు కూడ ఇస్త.' ...

'మిమ్మల్ని ఎప్పుడైనా అడిగిన్నా'

'కోట్లకైనోళ్ళు మందిని ముంచుతలే.. నువు గరీబోనివి, నీ కష్టాలు నా కష్టాలు తీరుతై, ఇంగో నాకు ఆత్మహత్య చేసుకొనే డిప్రెసన్ రోగమని నా కోడలు వచ్చినోళ్ళతో ముచ్చట్లు, ఇన్ని రోగాలూ ఈ ఎగతాళి బతుకెందుకు చెప్పు, ఎన్నిసార్లు చావటానికి చేసినా ఆ దేవుని దయ అయిత లేదు నువ్వే దిక్కురా చచ్చేటప్పుడన్నా సుఖంగ చచ్చే అదృష్టమన్న లేదా, క్రిష్టాఫర్.. నీకు దండం పెడ్త నా కొద్దు ఈ బతుకు, నేను చావాలే చస్త'

'అమ్మగారు..' తప్పదా అన్నట్లు చూశాడు.

'తప్పదు నువ్వు ఇయ్యకుంటే నా దారి నేను చూసుకుంట వీళ్ళ రోగం తిరగాలె. తల్లంటే లెక్కలేదు దానికైతే మనిసినన్న పర్వా కుడలేదు నా ఉసురు తగలాలే వీళ్ళకు బుద్ధిరావాలే'

'సరే... నాకు కొంత టైమియ్యండి... ఇంక వేరే ప్రయత్నాలు చెయ్యకండి'

'నువ్వు చానా మంచోనివిరా క్రిష్టాఫర్'

జూబిలిహిల్స్ చౌరస్తా జిగేలు మంటూ కండ్లు బైర్లు కమ్మెటట్లు వెలిగిపోతోంది. హైద్రాబాదును సింగపూర్‌లా మార్చటానికేమో. అడుగడుక్కు వింతలు గొలిపే పెద్దపెద్ద మాయదారి లైట్లు, కరెంటును మండిస్తూ ఆకాశం నించి పిండి వెన్నెల మిరుమిట్లను రోడ్ల మీదకు కుమ్మరిస్తున్న మతాబుల్లా హైమాస్ట్ లైట్లు. సంపన్నుల విల్లాలను షాపింగ్ మాల్లను ధగధగలాడించటానికి ఈ పట్నపోల్ల భోగాలకోసం దర్జా వెలుగులకోసం, ఇక్కడ కాలిపోతున్న కరెంటుతో ఎండుతున్న

చేలకు ప్రాణంపోయొచ్చు ఎందరో రైతుల ఆత్మ హత్యలను ఆపొచ్చు, బితుకుబితుకు మంటున్న చీకటి పల్లెల్లో మినుకు మినుకు దీపాల వెలిగించొచ్చు. అక్కడి ఓ బంగలా బారు వరండాలో గన్‌మెన్లు, సంకల్లో 47లు అటూ ఇటూ ఊగుతుంటే తీరుబడిగా చాయ్ తాగుతున్నారు. లోపల హాల్లో షాండిలియర్ మసక వెలుగులో విస్కీ గ్లాసులు తళుక్కుమంటూ లేచాయి.. డైనింగ్ టేబుల్‌పై హైద్రాబాదీ ఘుమఘుమలు. ఎదురుగా ఇస్త్రీ ఖద్దరులో కొలువుదీరిన మన బడా బాబులు హాయిగా నవ్వుకుంటున్నారు పొగడ్తలు సొంత డబ్బాలు మస్కాపాలిష్‌లు జోకులతో బలిసిన బొజ్జలు నిమురుకుంటూ సందడిగా సంబరాలు చేసుకుంటున్నారు. నిజానికి మన ఈ లీడర్ బాబులు గొడ్డల్లు వేట కొడవళ్ళు పట్టి నరుక్కుంటారేమో అన్నట్టు మీటింగుల్లో టీవీ ఛానళ్ళలో నిప్పులు చెరుగుతూ అరుచుకుంటూ ప్రజల్ని నమ్మిస్తారు, అయితే పోలిటిక్సు పాలిటిక్సే వ్యాపారం వ్యాపారమే.. ప్రాంతాలకతీతమైన మురాతత్వం, నీతీ నిజాయితీని పాతర పెట్టే మాఫియా మతం, ఏజెండా ఎత్తినా, అధికారంలో ఉన్నా విపక్షంలో ఉన్నా విస్తరించుకున్న తమ నేర సామ్రాజ్యంలో ఫ్యాక్షన్ కారిడార్లతో అధికార లాబీలతో కోట్ల విలువైన సర్కారు కాంట్రాక్టులు కాజేస్తూ... మైనింగ్ లీజులతో, క్రషర్ల కోరల్లో జేసీబీల చక్రాల కింద కొండలను పిండిచేసి గిరిజన ఆవాసాలను ఛిద్రం చేస్తూ ఈ దేశాన్ని కొల్లకొట్టటానికి విదేశాలకి అమ్మేయటానికి వీళ్ళంతా ఒక్క తాటిమీదకొచ్చి స్పాట్ పెట్టేస్తారు... విస్కీ మళ్ళీ చీర్సంది.



'హైద్రాబాదు చుట్టుపట్ల మన రియలెస్టేట్ రాజ్యానికి ఢోఖాలేదు..., అయితే రోశయ్యగారి హయాంలో కేసీఆర్ గారి కేకలకు మేల్కొన్న మనకు అక్కడ రాజధాని గురించి పల్స్ దొరకటం అదే సమయానికి అమెరికా నుంచి మన మిత్రులు పంపినడాలర్లు ఇక్కడ సర్కారు కాంట్రాక్టుల్లో కలిసొచ్చిన రూపాయితో మనం రౌండప్ చేసిన వేల ఎకరాలు అప్పుడే కోట్లకు పలుకుతున్నది. ఇక ఒక్కో గజం భూమి బంగారు బిస్కెట్టే, చప్పట్లు

'పాత పార్టీలను తుంగలో తొక్కి జంపు జిలానీలమైతే అయ్యాం కానీ ఏసియా గేమ్స్ పతకాలను మించి మనందరికి టికట్లు వచ్చాయి. ఎవరు గెలిచినా మనకు పవరుంటుంది, మన లాబీలు లావాదేవీలు ఇలాగే సాగుతాయని నా మాటిస్తున్నా..' చప్పట్లు కేరింతలు

'అన్నా చాలా థాంక్సే నాకు టికటిప్పిచ్చి బతికిచ్చినవే' గ్లాసులు మళ్ళీపైకి లేచాయి.

'అయ్యో చస్తున్న... కొడ్కా.. చస్తున్న కాపాడండి' ఒక్కసారిగా గుండెలదిరే ఆర్తనాదాలు.

గన్‌మెన్లు తపాకులు ఎక్కుపెట్టి పరుగులు తీశారు. మంది మార్బలం ఇల్లంతా కలియతిరిగి దొంగను పట్టినట్టు ఆఖరికి పెద్ద దొరసాని గది ముందుకు చేరారు.

'కొడ్కా... నేను చస్తున్న... కాపాడు, అయ్యో నేను చస్తున్న' భయంతో వణుకుతోంది.

'అమ్మా ఏందే ఆయాసమనిపిస్తున్నదా'

'కాదు బిడ్డా'

'మరి గుండె నొప్పా'

'అయ్యో గుండెనొప్పి కాదురా విషయం... విషం కొడ్కా'

'విషమా విషమేందే సరిగ చెప్పు ముసల్దాన'

'క్రిష్టాఫర్ గాడు నా నగలు తీసుకొని విషమిచ్చిండు, మింగిన కొడ్కా నన్ను బతికించు బిడ్డా నీ కాల్మొక్కుత' గుండెలు బాదుకుంటోంది.

'అయ్యో ముసల్దానా నా కొంప ముంచినవే నాకు ఎంపీ టికటొచ్చిందే'..

'నేను సుత ఇయాల మంచిరోజనే విషమ్మింగిన... కొడ్కా నేను సావ.. బతికించు'

'అయ్యో ఎట్ల నేనేం జేతు. నీయవ్వ ముసల్దానా..'

'రెడ్డి' ఇలారా పెద్దాయన పిలిచాడు.

'అన్నా చూసిండ్రా విషమ్మింగిదట'

పెద్దాయన భుజం తట్టుతు 'రెడ్డి పెద్దావిడ ఇరకాటంలో పడేసింది... బయటికి ఏ హాస్పిటల్‌కి వెళ్ళినా మీడియాకెక్కుతావ్. నిన్ను జలయజ్ఞం కాంట్రాక్టర్ బురదలోనించి బయటపడేసి, పారిశ్రామికవేత్తవని నిరుద్యోగులకు ఉపాధినిస్తున్నావని టికెట్ తెచ్చా. ఆత్మహత్యని బయటపడితే మీడియా వాళ్ళు నిన్ను ఫుట్‌బాల్ ఆడుతారు. అప్పుడు హై కమాండ్‌కు నచ్చ చెప్పలేం. ఓ పని చేద్దాం డాక్టర్‌కి సర్కిల్‌కి ఫోన్ చేస్తా ఇక్కడికే వస్తారు.

'అన్నా... ఒకవేళ డాక్టర్ని ఇక్కడికి పిలవకుంటే ఏమైతది'

'పెద్దావిడకదా పోతుంది... మొదటికే మోసం... గాభరా పడకు... సర్కిల్.. డాక్టర్ మనవాళ్ళే.. మంచైనా చెడైనా ఇక్కడే మానేజ్ చేస్తారు. ఆ కాంపౌండర్ని రప్పించి విషయం పొక్కకుండా నిండా నోట్లుకుక్కి వాడి నోరు మూయించు. ఎలక్షన్ కోడ్‌లోకి వచ్చేశాం మేము వెంటనే ఇక్కడ్నించి వెళ్ళడం మంచిది వెళ్తాం'

'అన్నా... అంతా నువ్వే చూసుకోవాల్నే నేనుంట మల్ల'

'ఫరావాలే గుట్టుచప్పుడు లేకుండా యవారం క్లోస్ చేసికో' గన్‌మెన్ల దన్నుతో వెళ్ళిపోయారు.

'స్టమక్ వాష్ చేయించాం, ఇంజెక్షన్స్ చేశాం... పూర్తి స్పృహలో ఉన్నారు లంగ్స్ క్లియర్, చాలా పవర్ ఫుల్ పాయిజన్

ఇచ్చాడు. టైముకు వచ్చాం లేకుంటే ప్రాణం పోయేది.. ఆక్సీజన్ ఇస్తున్నాం గాభరా వద్దు' నేనున్నా అన్నట్టు భుజం తట్టాడు డాక్టర్.

'డాక్టర్ సాబ్... ఎంత డబ్బైనా సరే ముసల్ది చావొద్దు...'

'కన్న తల్లి కదా టెన్షనుంటదిలెండి'

'కన్న తల్లి కాదువయా ఎంపీ... టికెట్.. టెన్షన్.. పారేశాని'

'పారేశాని కాకు కొడ్కా నన్ను చావకుండ చూస్కో.. నువు మినిస్టరైతవు' ఆక్సిజన్ మాస్క్ జరిపి అరిచింది.

'నోర్ముయ్ ముసల్దానా'

'రెడ్డిగారూ కాంపౌండర్ గాడు దొరికాడట.. పట్టుకొస్తున్నారు' సర్కిల్.

'రానీ లండ్డికొడుకుని'

'కోపం వద్దు.. ఎలెక్షన్ కోడ్.. లేకపోతే నేనే అనాకొడుకుని ఛత్తీస్‌ఘడ్ పంపేవాన్ని.

కాంపౌండర్ని పట్టుకొచ్చారు.

'దొంగసాలే' ఊగిపోయాడు రెడ్డి. 'బంగారం కోసం విషమిస్తావుర ఇప్పుడు చస్తే నా నోట్లే మన్నుపడ్తదిరా'

'అదేదో రెడ్డిసాబ్ నే అడుక్కుంటే బాగుండేది కదరా కేడి నా కొడకా, 'లాఠీ లేపాడు.' సర్కిల్

'జూబ్లీహిల్స్ గొప్పోళ్ళురా విదిలిస్తే లక్షలు రాల్తయి.. వైద్యవృత్తికే కళంకం తెచ్చావు కదరా బిక్షపు వెధవ్వా' డాక్టర్.

'గా విషం ఎలక్షన్లు అయినంక ఇయ్యకపోయినావుర లంబ్డీ కొడ్కు... కోట్లుపెట్టి వోట్లను కార్యకర్తల్ని గుత్త పట్టినం... పది తులాల కోసం మా పానాలు కిందమీద చేస్తున్నవురా.'

'కొడ్కా... నా పానం సుతా కిందమీదైతాంది జర నన్ను కేర్ దవాఖానకు తీస్కపోరా'

'నువ్వు సచ్చినా సరే బయటికి తీస్కపోను ఆపోజిసనోళ్ళు మీడియావోల్లు లొల్లి చేస్తే హైకమాండు నా సీటు గుంజుకుంటది,.

అప్పుడు నేను బిచ్చపోన్నైత.'

'అయ్యో కొడ్కా... కన్న తల్లి పానం కంటే నీ ఎంపీగొప్పనార'

'ఏయ్ ముసల్దానా ఓట్లైనంక అడిగితే నేనే ఇచ్చేటోన్నే విషం, నలుగురికి తెలిస్తే నా ఎంపీ మట్లేకలుస్తది'

'అంతేనా బిడ్డ... నియమ్మనురా'

'అయితే అయినవుపో నా ఎంపీ కంటే ఎక్కువా ఏంది'

'ఛీ... నా కడుపున సెడ పుట్టినవురా నేను సచ్చినా ఏం కాదా... ఇప్పుడు సస్తే నీ సీటు పోతదా... బిచ్చపోనివైతవా



థూ... నీ అమ్మనైనందుకు రోతపుడ్తాంది నా కొద్దుర ఈ బతుకు, బత్క నే చస్త చస్త బతక' పెద్దదొరసాని ఆక్సిజన్ మాస్కు సెలైన్ ట్యూబులూ పీకి నేల కేసి కొట్టింది... 'నేను చస్త.. బతక... చస్త'

'అయ్యో డాక్టర్ సాబ్ ముసల్ది సస్తాంది... సస్తాంది... నా ఎంపి.. ఎంపి...'

'థూ.. నీ ఎంపీల పీనిగెల్ల... ఆరేయ్... నీ అయ్య చస్తే... బతుకుదెరువు కోసం నెత్తిన గంప, సంకన నిన్ను ఎత్తుకోని బజార్లు తిరుక్కుంట కూరగాయలు అమ్ముకుంట సదివిపిచ్చి ఇంతటోన్ని చేసిన 'గుండెలు బాదుకుంటోంది.

'అయ్యో డాక్టర్సాబ్.. అమ్మా నువ్వుసావొద్దే నా ఎంపీ పోతె నేను చస్త నీ కొడుకునే'

'నువిప్పుడే సచ్చినవురా,. నువ్వేం కొడుకువురా పదవికోసం తల్లి సచ్చినా పర్వా చెయ్యానోడివి రేపు ఎంపీ వై ఇంకెంత మంది తల్లులను సంపుతవో ఈ దేశాన్ని పాకిస్తానుకు అమ్మేస్తవు... నేను బతక కృష్టాఫర్ నేను పోతున్నరా..."

'అమ్మగారు... మీరు పోరు మీకేం కాదు'

'డాక్టర్ని నేనే చెప్పలేకపోతున్న.. పోటుగాడు వచ్చాడు సర్కిల్ గారు వీన్ని పంపేయండి.'

'ఒరేయ్ ఎలక్షన్ కోడ్... బతికిపోయావ్... లాకప్‌లూ కోటింగులూ లేకుండా నిన్నొదిలేస్తున్న, రెడ్డిగారు ముందు వీన్ని పంపేద్దాము వీనికేదో ఇచ్చేయండి'

'చూడు తమ్మి ఒట్లైనంక నా ఎంపీ కోటాల నీకు మంచి జాబిస్తరా.... ఇక్కడ జరిగింది ఎక్కడా మాట్లాడకు సక్కగా ఇంటికిపో. మా అమ్మ బంగారం నువ్వే ఉంచుకో'

'మీ అమ్మగారి బంగారం పరుపుకిందనే ఉంది నాకేమీ వొద్దు' తెచ్చి ఇచ్చాడు.

'బంగారం వొద్దంటే ఇగోరా లక్ష రూపాయలు తీస్కపో'

'నాకొద్దు'

'లక్షంటే కార్పొరేట్ బిల్లింగోయ్ బిక్షపు వేశాలేయకు తీస్కోపో'

'శవాలకి సెలైను పీనిగెలకు ప్రిస్కిప్షన్ ఇచ్చి నీ కార్పొరేట్ బిచ్చపు వేషాలు అందరికి తెల్సు, అమ్మగారి ప్రాణాలు కాపాడటానికి చాలా కష్టపడ్డవు కదా జేబులోంచి కాగితం తీసి 'ఇగో... అమ్మగారికి నేను ఇచ్చిన డెడ్లీ విషం రశీదు చదువు' డాక్టర్‌కిచ్చాడు

# నాగేటి సూర్యుడు

- దామరకుంట శంకరయ్య
9440876788

మట్టిమాటాడుతుంది
హరితవర్ణం పరవశిస్తుంది
అతడు కంటపడితే

సమస్త జీవధాతువులకు
ఆధారమైన భూమి
ఫలిస్తుంది అతని చెమట ధారలతో

ప్రజల క్షుద్బాధ
అతనిదిగా భావించి
భూగోళపు మట్టిపై
బీజాలుజల్లు
లోకకళ్యాణ మూర్తి

భూత వర్తమాన
మానవజాతి చరిత్రను
రేపటికోసం నిలుపుతాడు



విశ్వ విపణిలో
ఒంటరిగా ప్రయాణిస్తూ
పాలకుల దుర్నీతిపై
కాండ్రించి ఉమ్మేసి
ఉరితాళ్ళకు చేరువౌతున్నాడు

ఈ విశాల విశ్వమంత
సువిశాలమైన మనసు వాడు
పుడమికి ప్రాణం పోయు రుతురాజు
ఆకలి చీకటిని చీల్చు
నాగేటి సూర్యుడు

---

'రేయ్ డాక్టర్ని రా మర్యాదగా మాట్లాడు'

'డాక్టర్సాబ్ మర్యాద తర్వాత వయ్యా ఆ డెడ్లీ పాయిజన్ అంట చదువు జల్దిన చదువు'

'రామక్రిష్ణా హోమియోస్టోర్స్... ఒన్‌గ్రమ్ ప్లేన్ పిల్స్ అంటే ఏ మెడిసిన్ కలపని ఉత్త తియ్యని హోమియోపతి గోలీలు'

'ఉత్త గోలీలా విషం కాదా... అంటే ముసల్దానికేం కాదా తియ్యటి గోలీలు విషంకాదు నా ఎంపీకేం కాదు... అమ్మ... దేవుడా ఎంకన్న కొండెక్కుత.... అమ్మా నీకేమి కాదే నా ఎంపికేమి కాదే నువు మింగింది ఉత్త గోలీలే నేను నెంపిని కాంపౌండర్ తమ్మి నీకు 5 లక్షలిస్త తీస్కో'

'నా కొద్దు'

'పోనీ పదిలక్షలు తీస్కో పో'

'నీ పైసా నాకొద్దు ఎందుకంటే అసలు బిచ్చగానివి, నువ్వే సార్.. జన్మనిచ్చిన కన్న తల్లి నేను చస్తున్న కొడ్కా కాపాడు అని గిలగిల కొట్టుకుంటుంటే కోట్లుపెట్టి ఎంపీ కొన్న... హైకమాండు గుంజుకుంటదని పదవి కోసం మానవత్వాన్ని మర్చినవు, నిన్ను మృగాలతో పోలుద్దామంటే నీ అంత నీచ్ కమీనే జంతువు నాకగపడ్తలే. మనుషుల్లనే నీచులున్నారు. వాళ్ళల్లో నువ్వొకడివి.'

'సరే నేను బిచ్చపోన్నే కాంపౌండర్ సాబ్‌నా పైసొద్దు బంగారమొద్దు... ఎందుకే ఇంత పారేశాని జేసినవ్'

'అగో ఆ అమ్మగారికోసం... ఆయమ్మకు బ్రతుకు అర్థం తెలవాలని, మానవ బంధాలని మర్చి, మమతానురాగాల వంతెనలను కాల్చేసి, వస్తు విలాసాల మజాలపడ్డ మీ సంపన్న జూబిలి మనుషులకు, ఎంత కౌగిలించుకున్నా కడుపుల లేని ప్రేమరాదని, రానిదాని కోసం పాకులాడి ప్రాణాల మీదకు తెచ్చుకోవద్దని, బతుకు విలువ బతికున్నప్పుడు తెలవనోళ్ళకి ప్రాణం పోతాంటే తెలిసొస్తదని తెలవాలని అట్ల చేసిన, పారేశాని చేసినందుకు క్షమించు అమ్మగారు... ప్రాణం పోతుందంటే బ్రతుకు ఎంత తియ్యగుంటదో మీకు తెలిస్తే చాలు'

'క్రిష్టఫర్ చిన్నోడివైనా చేతులెత్తి మొక్కుతున్నరా. నా చేతిల తుపాకి ఉంటే అది పెట్టి వీళ్ళందరిని నీ కాళ్ళు మొక్కించే దాన్ని కానీ ఎవరూ నీకు మొక్కక ముందే నువు దేవుని అవుతారమెత్తిన మనిషివిరా నేను బతుకుత బిడ్డ... నా ఊరికిపోయి నా గుడిసెల నా పల్లె మనుషుల మధ్య రంగమ్మక్కా పుల్లయ్య మామా ఎల్లన్న మల్లన్నల మధ్య... ఈ జూబిలి బిచ్చపోళ్ళకి దూరంగ సచ్చేదాక బతుకుత... బతికినంత కాలం నిన్ను తలుసుకుంట బిడ్డా... ఇంగ నువు వీళ్ళ ముంగటికెళ్ళి పో బిడ్డా... పైలం కొడ్కా...'



# జలగండం

- వర్చస్వి
9948356626

కొండనాలికని కొండకొమ్మున అలంకరిద్దామని-
ఉన్ననాలికకే ఉప్పుపాతరేసేస్తాం
కలల హర్మ్యాలకి కరువాచిపోయినట్లు
నీటిచుక్క అనైనా చూడకుండా చిదిమేస్తాం
జలరాశుల గలగలల కన్నా
జేబున కాసుల గలగలలే మోత ఎక్కువ కదూ!
పుష్కల సాగర జలాలనైనా
పునీత గంగా జలాలనైనా
రంగద్ది ఫోటో ఫ్రేము కట్టడమో
రాగి చెంబుచేత పుక్కిట పట్టించడమో
మనకేనాటినుంచో ముచ్చటేగా
అనంత జలనిధుల్నైనా
అరచేతిలో ఔపోసన పట్టడం అలవాటేగా
అమాయకంగా నోళ్లెళ్ళబెట్టిన
జలాశయాల్ని స్కేళ్ళతో కొలిచేస్తాం
నీళ్ళ కడవలా ముద్దొచ్చే
సాగర క్షీరాల పొదుగుల్లో
కాంక్రీటు పునాదులు వేసేస్తాం
జనానికీ జలానికీ జలగండం తప్పేట్టులేదు
ఇక నీటి కయ్యులు కళ్ళెదురుగా ఉరేసుకుని సమాధవడం
పైన నూరో అంతస్తు లోంచి చక్కగా కనబడుతుంది ...
అచ్చంగా



రొచ్చు లోంచి తల పైకెత్తి
మురికివాడ ఎప్పట్లా చూస్తున్నట్టు!
రండి! డబ్బుల దుప్పటి సిగ్గులేకుండా ఆకాశంలో పరుద్దాం
దాచుకోలేని శిధిల దేహాల్నీ,
అన్నార్తుల ఆకలి కేకల్నీ
రేషన్ కార్డుల్లా కిందకి ఏరి పారేద్దాం
డబ్బులు నీళ్ళలా ఖర్చు పెట్టైనా సరే
ఇకపై నీళ్ళు కళ్ళకు కనబడకుండా చేద్దాం



## ఖమ్మం సాహితీ మూర్తులు

**సంపటం దుర్గా ప్రసాదరావు**

వెల : రూ.100/- పేజీలు: 123

ప్రతులకు : 9247873162, 8466965401

తెలంగాణ ఏర్పడిన తరువాత ప్రప్రథమంగా ఖమ్మం జిల్లా సాహిత్యకారులను ఇంత మందిని పరిచయం చేస్తూ గ్రంథం రావడం సంతోషదాయకం. ఇది ఎంతో మంది సృజనకారులకు ప్రేరణగా, ప్రోత్సాహకంగా నిలుస్తుంది. ఇలాంటి పనులు ప్రభుత్వమే చేపట్టి చేయాల్సినివి.

**- కె. ఆనందాచారి**




## కొండా... కోనల్లో...

**ఆదివాసీ కథలు**

**డా॥ దిలావర్**

వెల : రూ.100/- పేజీలు: 152

ప్రతులకు : 9866923294, 7382552236

అటు విశాఖపట్నం, అరకులోయ నుండి ఇటు ఆదిలాబాద్ జిల్లా ఉట్నూరు వరకూ పర్యటించాను. ఇక గోదావరి లోయ ప్రాంతం... పాపికొండలు... చర్ల, సత్యనారాయణపురం, వెంకటాపురం వెళ్ళాను. చట్టి, చింతూరు, మోతె-సీలేరు ప్రాంతాలు కూడా చూశాను. అందువల్ల ఆయా ప్రాంతాల్లో అడవి బిడ్డలను దగ్గరగా గమనించే అవకాశం కలిగింది. ఇలా ఆదివాసీల మధ్య తిరిగిన అనుభవం నాచేత యీ కథలు రాయించింది.

**- డా॥ దిలావర్**




## కవిత్వం

**మూడు భాగాలు**

**జూకంటి జగన్నాథం**

మొదటి భాగం : రూ.200/-, రెండవ భాగం : రూ.300/-, మూడవ భాగం : రూ.150/- పేజీలు: 336

ప్రతులకు : 9440178095, 9440169896

అవునవును పొంగిన నా నెత్తురు చివర మొలిచిన చెమట బిందువు - నడి ఎండల్లో కూలీలను అక్కున చేర్చుకొనే చిగురాకుల కానుగచెట్టు - వానాకాలం ప్రారంభంలో దూరంగా కురిసిన వాన చినుకులకు భూమిలోంచి విరజిమ్మిన పరీమళ ద్రవ్యాలే నా కవిత్వం అర్థాలు పరమార్థాలు - సమాజానికీ నాకూ మధ్య నా కవిత్వం ఒక యానకం.

**- జూకంటి జగన్నాథం**




## వెన్నెల జలపాతం

**(కవితా సంపుటి)**

**గుండాల నరేంద్రబాబు**

వెల : రూ.50/- పేజీలు: 60

ప్రతులకు : 9493235992

ఈ కవిత్వం మంచితనమే తప్ప మాయలేదు, హిపోక్రసీలేదు. పాండిత్య ప్రదర్శనలేదు. తన చుట్టూ జరుగుతున్న సంఘటనల పట్ల, తన బాల్యం, తన పల్లెటూరు, తను తన అనుభవాల పట్ల అతడి ప్రతిస్పందనే ఈ కవిత్వం. తెలియని విషయాలు జోలికో, అనవసర ఊహల్లోకో వెళ్ళకపోవటం ఈ కవికున్న మంచి లక్షణం.

**- పలమనేరు బాలాజీ**



## కొండచిలువ

**కథానికలు**

**డా॥శాంతినారాయణ**

వెల : రూ.100/- పేజీలు: 167

ప్రతులకు : 9391343916

ఈ కథలన్నీ ఇవాళ రావలసిన కథలే. భారతీయ కథానికా సాహిత్య సమూహంలో ఇవీభాగవే. అనంతపురం జిల్లా వంటి కరువు పీడిత ప్రాంతం నుండి ధర్మాగ్రహంతో ఒక కథకుడు ఈ కథలలో అనేక వ్యాఖ్యాలు చేశారు. అనేక విషయాలు ప్రస్తావించాడు. వాటిలో ఆగ్రహం, ఆవేదన గూడుకట్టుకొని ఉన్నాయి. అవి నిజాయితీ సిరాతో కథల రూపం పొందాయి.

**- రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి**



## దారిలో లాంతరు

**రక్షిత సుమ**

వెల : రూ.50/- పేజీలు: 48

ప్రతులకు : ప్రముఖ పుస్తకాల షాపుల్లో

భవిష్యత్తును చూడగలిగిన కవే నిజమైన కవి. గత వర్తమానాలను పర్యవేక్షిస్తూ భవిష్యత్ పథాన్ని నిర్మించగల వారి, చూడగలిగిన వారి కవిత్వం నిలబడిపోతుంది. రక్షిత సుమలో అలాంటి లక్షణాలున్నాయి. ఈ చిన్న చిన్న అడుగులతో రేపు గొప్ప కవిత్వ ప్రయాణాన్ని సునాయాసంగా చేయగలదని నా నమ్మకం.

**- శిలాలోలిత**



## కథానికలు

డాక్టర్ వాసా ప్రభావతి

వెల : రూ.100/- పేజీలు: 139

ప్రతులకు : 9391343916

"ఊరగాయజాడీ"తో ప్రారంభమై ఈ కథానికా సంపుటి 'నాకూ ఓ మనసుంది'తో ముగుస్తుంది. ఛాందస కుటుంబాల్ని మన కళ్ళ ముందుంచుతూనే, వాళ్ళలో విప్లవాత్మక భావాల్ని మెరిపించారు రచయిత్రి. 'కొత్తవెలుగు', 'అనసూయ లేచిపోయింది' లాంటి కథానికలు అందుకు నిదర్శనాలు. పెదాలమీద చిరునవ్వుని తాండవింపజేసే కథానికలు- 'ఊరగాయజాడీ', 'కామాక్షి-కాసులపేరు' లాంటివి.

**- వేదగిరి రాంబాబు**



## కథాకృతి

(పరిచయాలు-పరామర్శలు)

మూడవభాగం

విహారి

వెల : రూ.100/- పేజీలు: 166

ప్రతులకు : 9391343916

వైవిధ్యాన్ని సంతరించుకున్న ఎన్నో కథానికల్ని చదివి గుండె పండించుకొని, ఎక్కువ సందర్భంలో గుండె మండించుకుని - భావస్పందనతో, మోయలేని గుండె బరువుతో, అనిర్వచనీయమైన అనుద్వేగంతో, అపూర్వమైన ఆత్మీయ స్పర్శతో పరామర్శించాను, పరిచయం చేశాను! చిత్తగించండి.

**- విహారి**



## కథాకేళి

ఎం.నాగకుమారి, ఎం.రామారావు

వెల : రూ.60/- పేజీలు: 90

ప్రతులకు : ............

మామూలుగా ఒక్కో పత్రికలో ఒకటి లేక రెండు కథానికల్ని చదవగలం. కానీ సంకలనంలో బహుమతి పొందిన కథానికలన్నిటితో పాటు మరికొన్ని కథానికలను కూడా చదివే అవకాశాన్ని కల్పించిన సంకలనకర్తలు అభినందనీయులు. కథానికా ప్రియులకు ఈ సంకలనం తప్పకుండా మంచి విందేనని చెప్పగలం. రచయితలకు, సంకలనకర్తలకు, 'కథాకేళి' పత్రికకు నా శుభాకాంక్షలు.

**- డా॥వేదగిరి రాంబాబు**



## శ్రీకృష్ణదేవరాయ జయంత్యుత్సవ

ఉపన్యాసాలు - వ్యాసాలు

(1929-1936)

డా॥ అప్పిరెడ్డి హరినాథరెడ్డి

వెల : రూ.150/- పేజీలు: 160

ప్రతులకు : 9963917187

నిజానికి వారితో నాకిప్పటికీ ముఖాముఖి పరిచయం లేదు. వారి రచనల ద్వారానే పరిచయం. అరుదైన శాసనాలు, తాళపత్ర గ్రంథాలు సేకరిస్తున్నారని తెలిసి సంతోషించాను. ఇప్పుడీ గ్రంథం అలనాటి 'శ్రీ సాధన', 'కౌమోదకి' పత్రికల నుండి సమాచారాన్ని సంగ్రహించి విలువైన సమాచారాన్ని వెలుగులోకి తెచ్చినందుకు అభినందిస్తున్నాను.

**- వకుళాభరణం రామకృష్ణ**



డా॥ రావూరి భరద్వాజ

## సాహితీ ప్రస్తావన

రావూరి లక్ష్మికుమారి

వెల : రూ.50/- పేజీలు: 75

ప్రతులకు : 24224458, 24224459

జ్ఞానపీఠ్ అవార్డు లభించిన తరువాత శ్రీ భరద్వాజ గారి రచనలు చదవాలన్న ఆసక్తి నేటితరం పాఠకులల్లో రేకెత్తింది. ఆయన జీవితంలోని ముఖ్యమైన ఘట్టాలను, మాటలను తెలుసుకోవాలన్న కుతూహలం చాలామందికి కలిగింది. భరద్వాజ గారి రచనలు వారి మాటలు, జీవితంలోని అమూల్య ఘట్టాలను తెలుగు వారికోసం అందించే చిరుప్రయత్నమే-ఈ "డా॥రావూరి భరద్వాజ సాహితీ ప్రస్తావన".

**- రావూరి లక్ష్మికుమారి**



సమకాలీన భారతీయ కవిత్వానువాదం

## స్వరధార

డా॥మాటూరి శ్రీనివాస్

వెల : రూ.150/- పేజీలు: 108

ప్రతులకు : 9849000037

'స్వరధార' భారతీయ కవిత్వం, ఎన్నో దశాబ్దాల తర్వాత, ఈ కవులెవరూ మిగలని కాలంలో మనకు అందుతున్న గతపు కథ కాదు. ఇదొక సజీవ వర్తమాన ధ్వని. వీరూ మనలాగే, భావ సంఘర్షణల మైదానంలో నిలబడి ఉత్తర భారతదేశాన ఊపిరి కుంపట్లు మోస్తున్నవారు. పిలిస్తే పలికేవారు, వారి కవితలను సకాలంలో అనువదించి అందించడం డా॥ శ్రీనివాస్ చేసిన విలువయిన పని.

**- రామతీర్థ**

## మన ప్రపంచం




**వారం వారం వ్యాఖ్యానం**

**దుప్పల రవికుమార్**

వెల : రూ.75/- పేజీలు: 176

ప్రతులకు : 9989265444

'మన ప్రపంచం', నగటు వివేకవంతుడి ఆవేదనకు నిలువుటద్దం. విలువలనే వలువలూడి పోయిన సమాజపు నగ్నత్వానికి ప్రతిబింబం. ఇందులో శ్రీకాకుళం పట్టణ రాజకీయాల నుంచి అమెరికా దాష్టీకం వరకూ అన్నీ ఉన్నాయి. జర్నలిజం మీద మక్కువ ఉన్న రచయిత నుంచి జాలువారిన వ్యాసాలు కాబట్టి, దాదాపుగా పుస్తకంలోని అన్ని వ్యాసాలు మీడియాను స్పృశిస్తూనే ఉంటాయి.

**- జి.వి.రమేష్**

## నమ్మకాలు వమ్మవుతున్నచోట




**కవిత్వం**

**ఏలేశ్వరం వెంకటేష్**

వెల : రూ.100/- పేజీలు: 112

ప్రతులకు : 9849487146

గోదావరిఖని తను ఉంటున్న ప్రాంతం కనుక బొగ్గు 'పెల్లలకు' కావ్యగౌరవం కల్పిస్తాడు. 'బాయి పనోడు' గురించి రాస్తాడు. ఆ మనిషి (అంటే గని కార్మికుడు) తన డొక్కు సైకిల్ తొక్కుకుంటూ, లోలోపల గొనుక్కుంటూ వస్తాడని మనకు పరిచయం చేస్తాడు. ఆ సైకిల్ కుప్పగా ఉన్నా అది బాయి పనివాడి ఆస్తి, గుర్తింపు చిరునామా, "నమ్మకాలు వమ్మవుతున్నచోట" అనే పేరుతో తీసుకొస్తున్న ఈ కవితా సంపుటిలో మొత్తం 53 కవితలున్నాయి.

**- డా॥ నలిమెల భాస్కర్**

## వ్యక్తిత్వ నిర్మాణం




**ప్రపంచ విజేతలు**

**వ్యక్తిత్వ నిర్మాణం**

**డా॥ కత్తి పద్మారావు**

వెల : రూ.100/- పేజీలు: 135

ప్రతులకు : 9849741695

ప్రేమ వైయక్తికం కాదు, విశ్వజనీనం అని తెలుసుకోవాలి. ప్రపంచ మానవులుగా ఎదగాలంటే నిరంతర అధ్యయనం, అవగాహన, పరిశోధన, పునర్నిర్మాణం అవసరం. అందుకు ఈ గ్రంథం మీ చేతిలో ఒక గుభాళించే పుష్పగుచ్ఛంలా ఉంటుంది. మిమ్మల్ని పరిమళింప చేస్తుంది.

**- కత్తి పద్మారావు**

## కొత్త చిగురు




**సింహ ప్రసాద్**

వెల : రూ.120/- పేజీలు: 160

ప్రతులకు : 9849061668

ఈ నవలలో రచయిత స్పృశించని అంశం లేదు. ప్రేమలున్నాయి. వయస్సు వేడితో హరించుకుపోయే జీవితాలున్నాయి. విద్యా వ్యాపారం ఉంది. యువత తమ కాళ్లపై తాము నిలబడాలనే తపన ఉంది. కులమతాలకతీతమైన బంధాలున్నాయి. అనుబంధాలున్నాయి. పాఠకులకు షడ్రసోపేత విందు 'కొత్త చిగురు' అనడంలో సందేహం లేదు.

**- చంద్రప్రతాప్**

## అంబేద్కర్ - లోహియా




**డా॥ కత్తి పద్మారావు**

వెల : రూ.100/- పేజీలు: 120

ప్రతులకు : 9849741695

ఈ గ్రంథం స్వాతంత్రోద్యమకాలంలో అంబేద్కర్ - లోహియా పాత్రలను విశ్లేషించిన గ్రంథం. వీరి రువురు కులాధిపత్యం మీద పోరాడిన వారే. అంబేద్కర్ హిందూ సామ్రాజ్యవాదం మీద కూడా పోరాడారు. భారత రాజకీయాల్లో కులం పాత్ర, మతం పాత్ర ఈ గ్రంథంలో చర్చించాను.

**- డా॥ కత్తి పద్మారావు**

## కాలాన్ని అధిగమించి




**నిఖిలేశ్వర్**

వెల : రూ.100/- పేజీలు: 134

ప్రతులకు : 9177881201

కొందరైనా పాఠకులు, కవిత్వం చదువుతున్నారనే ఆశతో, పరస్పర సత్కారాలు - సన్మానాలు - పురస్కారాలతో తెలుగు కవితాలోకం, వివిధ - అస్తిత్వ అంతరంగ కథనాలతో సజీవంగా వున్నది. ఈ నేపథ్యంలో గత రెండు సంవత్సరాల కాలంలో రాసినవి, గతంలో సంపుటాలలో రానివి కొన్ని చేర్చి ఈ కవితా సంపుటితో మీ సమక్షంలోకి...!

**- నిఖిలేశ్వర్**

# కర్నూలు జిల్లాలో గురజాడ వేంకట అప్పారావు శతవర్ధంతి సభలు

సంఘ సంస్కర్త గురజాడవేంకట అప్పారావు శతవర్ధంతి సభలు కర్నూలు జిల్లాలో సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో జరిగాయి. సాహితీస్రవంతి జిల్లా కమిటీ పిలుపు మేరకు కార్యక్రమాలు జరిగాయి. 2014 నవంబర్ 30 నుండి ఏడాదిపాటు జిల్లాలలోని అన్ని ప్రధాన పట్టణాల్లో నిర్వహించడం. గురజాడ అప్పారావు రచనలు సామాన్య ప్రజానీకం వరకు చేరువ చేయాలని, గురజాడ రాసిన దేశభక్తి గేయం ప్రపంచగేయంగా ఐ.రా.స తీర్మానించాలని ఆ కేంద్ర ప్రభుత్వం ఆదిశగా కృషి చేయాలని సభల్లో పాల్గొన్న వక్తలు ముక్తకంఠంతో డిమాండ్ చేశారు.

**నంద్యాలలో...**

సాహితీస్రవంతి నంద్యాల డివిజన్ కమిటీ ఆధ్వర్యంలో రావూస్ బాలుర హాస్టల్లో డివిజన్ అధ్యక్షులు శ్రీనివాసమూర్తి సభాధ్యక్షతన సభ నిర్వహించారు. ఈ సభకు ముఖ్య అతిథిగా విచ్చేసిన సాహితీస్రవంతి రాష్ట్రకార్యదర్శి జంధ్యాలరఘుబాబు మాట్లాడుతూ ఈసురోమని మనుషులుంటే దేశమేగతి బాగుపడునోయ్ అంటూ ప్రజలభాషలో రచన చేసిన గురజాడ మహనీయుడున్నారు. దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్ అంటూ ప్రజల్లో దేశభక్తిని ప్రబోధించారని అన్నారు. దైవంకన్నా దేశం ముఖ్యమని చాటిచెప్పిన సందేశాత్మక సంఘసంస్కర్త గురజాడ అన్నారు. ఈ కార్యక్రమంలో డివిజన్ ప్రధాన కార్యదర్శి మాదాలశ్రీనివాసులు, ఉపాధ్యక్షులు అల్ఫోన్స్, కరీముద్దీన్, సమ్మద్, అవాజ్ రాష్ట్రకార్యదర్శి ముర్తుజాలు పాల్గొన్నారు.

**కర్నూల్లో...**



నగరంలో సాహితీస్రవంతి – జనవిజ్ఞానవేదిక సంయుక్తంగా కార్మికకర్షక భవన్‌లో జెవివి జిల్లా ప్రధానకార్యదర్శి బిడి సుధీర్‌రాజు సభాధ్యక్షతన గురజాడ వేంకట అప్పారావు శతవర్ధంతి వేడుకలు జరిగాయి. ఈ సభలో సాహితీస్రవంతి జిల్లా సహాయకార్యదర్శి పులిచేరి మహేష్‌కుమార్ మాట్లాడుతూ గురజాడ రచనలు సమాజాన్ని ప్రభావితం చేశాయన్నారు. సంఘశ్రేయస్సే గురజాడ సాహిత్య వస్తువన్నారు. సుధీర్‌రాజు మాట్లాడుతూ సామాజికచైతన్యానికి పర్యాయపదం గురజాడ అన్నారు. గురజాడ రచనలు నేటికీ ఆచరించదగ్గవన్నారు. ఈ కార్యక్రమంలో షరీఫ్, సత్యనారాయణరెడ్డి, మునిస్వామి పాల్గొన్నారు.

**ప్రజాశక్తి ఆధ్వర్యంలో...**



ప్రజాశక్తి కర్నూలు ఎడిషన్ కేంద్రంలో ఏర్పాటు చేసిన గురజాడ అప్పారావు శతవర్ధంతి ప్రారంభసభలో ముఖ్యఅతిథిగా ప్రజాశక్తి సంపాదకులు పాటూరిరామయ్య గురజాడ చిత్రపటానికి పూలమాలవేసి నివాళులు అర్పించారు. ఈ సభలో ఆయన



మాట్లాడుతూ వ్యవహారిక భాషను ప్రజల్లోకి తీసుకువెళ్ళడానికి గురజాడ వేసిన అడుగుజాడను అత్యధిక తెలుగుప్రజలు అనుసరించారన్నారు. వైదిక మనుధర్మవాదాన్ని పటాపంచలు చేసిన సామాజిక చైతన్యమూర్తి అన్నారు. కన్యాశుల్కం నాటకం

ద్వారా సాంఘిక దురాచారాలను ఎండగట్టాడన్నారు. ఎడిషన్ ఇంచార్జ్ పానుగంటిచంద్రయ్య అధ్యక్షతన జరిగిన సభలో సిజియం ప్రభాకర్, జియం హరికిషోర్ సిపియం రాష్ట్ర కమిటీ సభ్యులు టి.షడ్రక్, ఎడిషన్ కమిటీ సభ్యులు మురళి, ఎం. మంగయ్య, నరసింహులు, వేణుగోపాల్ తదితరులు పాల్గొన్నారు. పిఎన్‌యం నాయకులు బసవరాజు, ఆర్‌పి వాసులు ఆలపించిన అభ్యుదయ గేయాలు అలరించాయి.

**కోడుమూర్‌లో...**

ఆధునిక సాహిత్య క్రాంతిదర్శి గురజాడ వేంకటఅప్పారావు శతవర్ధంతి సభ కోడుమూర్ పట్టణంలో శ్రీశ్రీనివాస ఆంగ్లమాధ్యమ పాఠశాల ఆవరణలో సాహితీస్రవంతి కోడుమూర్ కమిటీ ఆధ్వర్యంలో జరిగింది. సభాధ్యక్షులుగా నరేంద్రబాబు, ముఖ్యఅతిథిగా విశ్రాంత ఉపాధ్యాయులు కవి అచ్చయ్య పాల్గొన్నారు. వక్తలు మాట్లాడుతూ తెలుగు సాహితీ వినీలాకాశంలో గురజాడ ధృవతార అన్నారు. సామాజికకోణంలో సాహిత్యరచన కొనసాగించిన మానవతావాది అన్నారు. గురజాడ రచనల్లోని స్త్రీ సామాజికమార్పు దిశగా పయనించిందన్నారు. ఈ కార్యక్రమంలో సాహితీస్రవంతి నాయకులు మహమ్మద్‌షఫి, నగేష్, సురేష్, పాల్గొని ప్రసంగించారు.

**ఎమ్మిగనూర్‌లో...**




కన్యాశుల్కం నాటకసృష్టికర్త, ఆధునిక సాహిత్యానికి అడుగులు నేర్పిన ప్రసిద్ధ సాహితీవేత్త గురజాడ వేంకట అప్పారావు శతవర్ధంతి సభ ఎమ్మిగనూను పట్టణంలో సాహితీస్రవంతి డివిజన్ కమిటీ ఆధ్వర్యంలో ఘనంగా జరిగాయి. డివిజన్ కమిటీ నాయకులు రచయిత్రి నాగమణి అధ్యక్షతన జరిగిన కార్యక్రమంలో జిల్లా ప్రధానకార్యదర్శి కెంగారమోహన్ మాట్లాడుతూ తెలుగుసాహిత్యానికి దిక్సూచి అన్నారు. దిద్దుబాటు, మెట్టిల్దా కథల్లోని స్త్రీ పాత్రలు సామాజిక మార్పుకు స్త్రీ చైతన్యానికి ప్రతిబింబాలన్నారు. కన్యాశుల్కం నాటకానికి 112 సవత్సరాలైందని నేటికి అత్యంత ప్రజాదరణ పొందిన నాటకమన్నారు. తెలుగుజాతికి సాహిత్యచైతన్యం కలిగించిన మహనీయుడన్నారు. దేశమును ప్రేమించుమన్నా మంచియన్నది పెంచుమన్నా గేయం ప్రపంచగేయంగా ఆమోదించాలన్నారు. ఈ దిశగా తెలంగాణ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలు కృషిచేయాలన్నారు. అలాగే గురజాడ శతవర్ధంతి సభలు అధికారికంగా నిర్వహించాలన్నారు. ఈ కార్యక్రమంలో కెవిపియస్ నాయకులు దేవసహాయం యుటిఎఫ్ రాష్ట్రనాయకులు శ్రీనివాసులు, రాఘవేంద్ర, నాగరాజులు పాల్గొన్నారు.

**ఆదోనిలో....**



ఆదోని డివిజన్ కమిటీ ఆధ్వర్యంలో పట్టణంలోని బిసి సంక్షేమ వసతి గృహంలో గురజాడ శతవర్ధంతి సభ జరిగింది. ఈ సభలో సాహితీస్రవంతి డివిజన్ నాయకులు పరిశోధక విద్యార్థి రాజా జయచంద్రన్ మాట్లాడుతూ గురజాడ సాహిత్య సృజన ఆంగ్లభాషతో ప్రారంభమై ఇండియన్ లీజర్ హవర్ పత్రికలో సారంగధర శీర్షికతో పద్యాలు రాశాడన్నారు. గురజాడ ప్రబోధకవిత్వ పితామహుడన్నారు. గురజాడ సాహిత్యాన్ని ప్రతి తరగతిలో పాఠ్యాంశంగా చేర్చాలన్నారు. వర్ధమాన కవులకు ప్రసిద్ధ కవులకు గురజాడ సాహిత్యం నిఘంటువు లాంటిదన్నారు. ఈ కార్యక్రమానికి డివిజన్ అధ్యక్షులు అవుల బసప్ప అధ్యక్షత వహించగా జిల్లానాయకులు కెంగారమోహన్, నల్లారెడ్డి, రఘురాం, యుఎన్ ప్రేమ్‌కుమార్, పాల్గొన్నారు.



## గురజాడ శత వర్ధంతి సభ

నవ్యాంధ్ర నిర్మాణంలో మహాకవి గురజాడ అప్పారావు ముందుచూపు; ప్రగతిశీల, ప్రజాస్వామిక భావజాలం ప్రతిబింబించాలని ప్రముఖ రాజకీయ విశ్లేషకులు, సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి అన్నారు. విశాఖపట్నం పౌరగ్రంథాలయంలో నవంబర్ 30న మొజాయిక్ సాహిత్య సంస్థ ఆధ్వర్యాన మహాకవి గురజాడ అప్పారావు శత వర్ధంతి వత్సర ప్రారంభ సభ జరిగింది. ఎల్ ఆర్ స్వామి అధ్యక్షతన జరిగిన ఈ సభలో తెలకపల్లి రవి ప్రారంభోపన్యాసం చేశారు. గురజాడ సాహిత్యాన్ని గుర్తు చేసుకోకుండా నవ్యాంధ్రలో కదలిక, చైతన్యం తేవడం సాధ్యం కాదన్నారు. రాచరిక వ్యవస్థలో ఉండి కూడా దేశభక్తి గురించి ఎలుగెత్తి చాటారని; స్త్రీలను శక్తివంతులుగా, చైతన్యవంతులుగా తీర్చిదిద్దారని అన్నారు. దురదృష్టం కొద్దీ నేడు దేశాన్ని ఏలుతున్న వారికి దేశభక్తి లేకుండా పోయిందన్నారు. 'దేశం అంటే మనుషులు కాదు. పెట్టుబడులు, ప్రచారార్భాటం' అంటూ తిరుగుతున్నారని ఎద్దేవా చేశారు. దేశమంటే మనుషులోయ్ అని గురజాడ చెబితే– ప్రస్తుత పాలకులు మనుషులను గుర్తించకుండా భూముల చుట్టూ తిరుగుతున్నారని విమర్శించారు. రాష్ట్రాలుగా విడిపోయినా రెండు తెలుగు రాష్ట్రాల ప్రజలను కలిపేది తెలుగు భాష ఒక్కటేనని అన్నారు. సాహిత్యం సామాన్యులకు చేరాలనే ఉద్దేశంతో గురజాడ ఆనాడు వాడుకభాషలో రచనలు చేశారన్నారు. ప్రపంచీకరణ జాడ్యంతో తెలుగుకు ముప్పు ఏర్పడిందని ఆందోళన వ్యక్తంచేశారు. గురజాడ 150వ జయంతిని మరచిన కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రభుత్వం చివర్లో హడావిడి చేసిందని, ఈ ప్రభుత్వం ఇప్పటికీ పట్టించుకోలేదని విమర్శించారు. ఆయన సాహిత్యానికి ప్రాచుర్యం లభిస్తే ప్రజలకు ప్రశ్నించే చైతన్యం వస్తుందని పాలకులకు భయమని విమర్శించారు. కమ్యూనిస్టులు వెలికితీశాకే గురజాడ రచనలకు ఈ మాత్రమైనా ప్రచారం కల్పించారని గుర్తుచేశారు. సాహితీవేత్త రామతీర్థ మాట్లాడుతూ గురజాడ జయంతికి కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రభుత్వం కేటాయించిన రూ. 5 కోట్ల నిధులు ఏం చేశారో చెప్పాలని నిలదీశారు. తెలుగు వైతాళికుల ప్రాచుర్యానికి, సాహిత్య ప్రచారానికి నిధులు కేటాయించాలని, దీనిపై సాహిత్యవేత్తలు గొంతెత్తాలని పిలుపిచ్చారు. గురజాడ సాహిత్యానికి ప్రాచుర్యం కల్పించకపోవడంపై ఆవేదన వ్యక్తం చేశారు. శత వర్ధంతి వత్సర సందర్భంగా గురజాడ రచనలకు విస్తృత ప్రాచుర్యం కల్పించాల్సింది ఉందని అన్నారు.



### ప్రజల్లోకి గురజాడ ప్రగతిశీల వారసత్వం

గురజాడ అప్పారావు అందించిన ప్రగతిశీల వారసత్వాన్ని ప్రజల్లోకి విస్తృతంగా తీసుకెళ్లాలని సాహితీ విమర్శకులు తెలకపల్లి రవి అన్నారు. మహాకవి గురజాడ శత వర్ధంతి సంవత్సరం ప్రారంభం సందర్భంగా విశాఖ విచ్చేసిన ఆయన విశాఖలోని గురజాడ కళాక్షేత్రంలోని గురజాడ విగ్రహానికి పూలమాల వేసి నివాళి అర్పించారు. నవ్యాంధ్ర నిర్మాణంలో గురజాడ తాత్విక దృష్టిని, ముందు చూపును ప్రతిబింబించేలా జాగ్రత్తలు తీసుకోవాలని సూచించారు. అనంతరం కవులు, రచయితలతో సాహితీ స్రవంతి జిల్లా కార్యదర్శి నూనెల శ్రీనివాసరావు అధ్యక్షతన చర్చాగోష్ఠి జరిపారు. తెలకపల్లి పల్లి రవి సాహిత్యకారుల కర్తవ్యాలపై మాట్లాడారు. సాహితీ స్రవంతి రాష్ట్ర ఉపాధ్యక్షులు సత్యాజీ, జిల్లా అధ్యక్షులు రమణాచలం, రమణారావు, రచయితలు అనంతరావు, ఎవిఆర్ మూర్తి, అడపా రామకృష్ణ, ఎయు రిటైర్డు అసిస్టెంటు రిజిస్ట్రార్ నాగేశ్వరరావు తదితరులు మాట్లాడారు. జివిఎన్ చలపతి, స్వతంత్రకుమార్, ప్రజాశక్తి విశాఖ ఎడిషన్ మేనేజర్ ఎస్. సుధాకర్ పాల్గొన్నారు.

## 'కన్యాశుల్కం' జీవిత దృక్పథాన్నే మార్చేసింది

గురజాడ అప్పారావు రచించిన కన్యాశుల్కం నాటకం తన జీవిత దృక్పథాన్నే మార్చిందని కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డుకు ఎంపికైన ఆచార్య రాచపాలెం చంద్రశేఖర్‌రెడ్డి పేర్కొన్నారు. జన విజ్ఞాన వేదిక, సాహితీ స్రవంతి జిల్లా శాఖల ఆధ్వర్యంలో కడప పట్టణంలో నవంబర్ 23న సీపీ బ్రౌన్ భాషా పరిశోధనా కేంద్రంలో రాచపాళెం అభినందన సభ నిర్వహించారు. ఈ సందర్భంగా నిర్వాహకులు ఆయనను ఘనంగా సత్కరించారు. అనంతరం ఆచార్య రాచపాళెం మాట్లాడుతూ అనంతపురంలోని సాహితీ వాతావరణం, ప్రజా ఉద్యమాలు తనకు అవార్డు లభించే స్థాయికి, తన ప్రస్థానానికి పునాది వేశాయన్నారు. ఆధునిక భారతదేశ చరిత్ర, ఉద్యమాల చరిత్ర, వాదాల చరిత్ర గురించి ఈ సందర్భంగా ఆయన విశ్లేషించారు. ప్రపంచంలోని ఏ సమాజానికైనా మార్క్సిజమే అంతిమ పరిష్కారమన్నారు. యూనిసెఫ్ పురస్కార గ్రహీత శశిశ్రీ మాట్లాడుతూ జాతీయ స్థాయిలో విమర్శకుడిగా ఎదిగిన రాజపాళెం రచయితలందరికీ మార్గదర్శకం కావాలన్నారు. డాక్టర్ ఎంఎం వినోదిని మాట్లాడుతూ సమాజంలో రానున్న ప్రమాదాలను గుర్తించగలిగేది సాహితీ విమర్శకులేనన్నారు. జేవీవీ జిల్లా ప్రధాన కార్యదర్శి ఎ. రఘునాథరెడ్డి మాట్లాడుతూ రాచపాళెంకు ప్రకటించిన అవార్డు తనకు వచ్చినట్లుగా సంతోషిస్తున్నామన్నారు. అభినందన సభలో జేవీవీ నాయకులు ఎస్. ప్రభాకర్, సునీత, రాజశేఖర్ రాహుల్, సరస్వతి, సాహితీ స్రవంతి జిల్లా కన్వీనర్ మస్తాన్‌వలీ, డాక్టర్ మనోహర్, డాక్టర్‌పుత్తా బాలిరెడ్డి, సీపీఎం జిల్లా కార్యదర్శి నారాయణ, రిటైర్డ్ డీఎస్పీ ఫణిరాజుతోపాటు జిల్లాలోని సాహితీవేత్తలు పాల్గొన్నారు.

## ఖమ్మంలో గురజాడ శత వర్ధంతి



గురజాడ తెలుగు సాహిత్యానికి అడుగుజాడ వంటివాడని ప్రధానవక్త డా॥పి.సుబ్బారావుగారన్నారు. బి.వి.కె.గ్రంథాలయంలో నవంబరు 30న సాహితీ స్రవంతి అధ్యయన వేదిక ఆధ్వర్యంలో గురజాడ శతవర్ధంతి కార్యక్రమం జరిగింది. ఖమ్మం పట్టణంలోని ఈ సభకు కపిల రాంకుమార్ అధ్యక్షత వహించగా అతిథులుగా సాహితీ స్రవంతి జిల్లా అధ్యక్షులు కన్నెగంటి వెంకటయ్య, కార్యదర్శి రౌతు రవి, పట్టణ అధ్యక్షుడు సంపటం దుర్గా ప్రసాదరావు, కార్యదర్శి కంచర్ల శ్రీనివాస్, సాహితీస్రవంతి రాష్ట్ర బాధ్యులు ఆనందచారి, కవితా డిగ్రీ కళాశాల ఉప ప్రధానాచార్యులు డా.ఆంజనేయులు పాల్గొని సందేశాలిచ్చారు. తొలుత బి.వి.కె. విద్యార్థి ఆసుప్రసాద్ "దేశమును ప్రేమించుమన్న" గురజాడ గీతాలాపనతో సభ ప్రారంభమైంది. కన్నెగంటి వెంకటయ్య మాట్లాడుతూ మన విశాల భావాలకు ప్రేరణగా విశ్వజనీనమైన కవి గురజాడ అన్నారు.

అగ్రహారీకుల ఆచార వ్యవహారాలలోని లోటుపాట్లను, ఛాందస భావాలను, మూఢనమ్మకాలను కన్యాశుల్కం ఎత్తిచూపిందన్నారు. అటువంటి సాంఘిక నాటకం మరొకటి ఇప్పటికి వరకు రాలేదన్నారు. మధురవాణి పాత్ర, గిరీశం, లుబ్ధావధానులు బుచ్చమ్మ, సౌజన్యారావు పంతులు లాంటి పాత్రలద్వారా సమాజాన్ని కళ్లకు కనిపించేలా చేయటంలో కృతకృత్యుడై ఉన్నారు. సాహితీ స్రవంతి రాష్ట్ర బాధ్యులు ఆనందాచారి మాట్లాడుతూ ఓ కొత్త ఒరవడికి, నూతన సాహిత్య ఆవిష్కరణకు రూపకర్తగాను, సాహిత్యంలో సంస్కరణలకు పూనుకున్న వ్యక్తి గురజాడ అన్నారు. గిడుగు, గురజాడలు మన తెలుగుకు వెలుగులని, జీవిత పర్యంతం భాషలో మార్పుకై పోరాడారని కొంత మందికి దూరమైనా తమ మార్గాన్ని విడువలేదన్నారు. నేటి తరం కవులు గురజాడలా తీవ్ర స్వరంతో రచనలు చేయాలని అభిప్రాయపడ్డారు. గొప్ప మానవతా వాదిగా, ప్రజా ప్రేమికుడిగా, దూరదృష్టిగల రచయితగా నేటి కాలపు దుష్ప్రభావాలను నాడే గుర్తించి కలం సంధించి విప్లకవి గురజాడ అని రాష్ట్ర గిరిజనసంఘం బాధ్యులు బండారు రవికుమార్ పేర్కొన్నారు. గురజాడ కవితా ఖండికలను కొన్ని చదివి వినిపించారు. కపిల రాంకుమార్ మాట్లాడుతూ విజయనగర సంస్థానంలో పనిచేస్తూ ఫ్యూడల్ వ్యవస్థలో పనిచేస్తూనే, నాటి సాంఘిక సామాజిక రుగ్మతలపై నగారా మోగించడమంటే మామూలు విషయం కాదని. ఆ తిరుగుబాటు స్థిర చిత్తుడైతే తప్ప వేరొక సామాన్యుడు చేయలేడని అన్నారు. తదుపరి డా.పి.సుబ్బారావు మాట్లాడుతూ కవిగానే కాకుండా చక్కటి చిత్రకళా విమర్శకుడిగా గురజాడను చూడాలని, "ప్రీమియర్ ఆఫ్ స్కల్ప్చర్" అనే రవివర్మ చిత్రాలను నిశితంగా పరిశీలించి అంతగా నచ్చలేదని చెప్పటంలో వారి పాత్రవం అవగతమవుతుందని అన్నారు. విలియం వర్డ్స్ వర్త్, షేక్స్పియర్, మొదలగు పాశ్చాత్య కవులనెందరినో చదివాడు కాబట్టే పటిష్ఠమైన సాహిత్యాన్ని, గురజాడ భావితరాల కుపయోగపడే విధంగా సృజన చేసాడని అన్నారు. రౌతు రవి మాట్లాడుతూ విద్యార్థులు దేశమును ప్రేమించుమన్నా త్వరగా అర్థంచేసుకుని నేర్చుకొనటంలో ఆసక్తి చూపుతున్నారని, సామూహికంగా గురజాడ గేయాన్ని చదివిస్తున్నామని అంటూ కార్యక్రమాన్ని ఇంతమంది హాజరై చక్కటి సందేశాలిచ్చినందుకు కృతజ్ఞతలు చెప్పి వందన సమర్పణ చేశారు.

**- కపిల రాంకుమార్**

## ఎక్స్‌రే పురస్కారాలు



సుంకర గోపాలయ్య

ఎక్స్‌రే 2014 జాతీయస్థాయి అవార్డు కవి సుంకర గోపాలయ్య, కోట, నెల్లూరు జిల్లా, రచన "ఒక సూర్యుడు - ఒక నెల వంక"కి లభించిందని ఎక్స్‌రే అధ్యక్షులు కొల్లూరి ఒక ప్రకటనలో తెలిపారు. విజేతకు పదివేల నగదు, జ్ఞాపికతో సత్కరించడం జరుగుతుందని ప్రధాన అవార్డుతోపాటు మరో పది మందికి ఉత్తమ పురస్కారాలు కూడా అందజేయబడతాయని తెలిపారు. ఈ సంవత్సరం ఉత్తమ కవితా పురస్కారాలు మందరపు హైమావతి (విజయవాడ) "నీలిగోరింట", కటుకోర్ఘ్యల రమేష్ (ఇల్లందు) "ఎవరైనా లైక్ కొట్టండీ", గుర్రాల రమణయ్య (నెల్లూరు) 'అక్షరం' వెంకటేష్‌వలన్‌దాస్ (నర్సాపూర్, మెదక్) "లలిత కళాతోరణం", కోసూరి రవికుమార్ (దాచేపల్లి) "మట్టీ-పూలూ... మరణిస్తున్న చోట" కె.వి. నాగేశ్వరరావు (కోవూరు,) "సందిగ్ధ సమయం" ఈతకోట సుబ్బారావు (నెల్లూరు) 'షరామామూలే', మల్లెల నరసింహమూర్తి (అనంతపురం) "కవితో మాట్లాడటమంటే", జి.విజయలక్ష్మీ (హైదరాబాద్) "నడుస్తున్న గాయం", బి.వి.వెంకట్రావు (ఆకునూరు) "భూగ్రహణం" అందుకోనున్నారు. 2014 ఎక్స్‌రే అవార్డు నిమిత్తం పోటీకి 356 కవితలు వచ్చాయని ప్రముఖ సాహితీ వేత్త నవలా కథా రచయిత అంపశయ్య నవీన్ (వరంగల్) న్యాయనిర్ణేతగా వ్యవహరించారని ఆ ప్రకటనలో తెలిపారు.

## 'చూపు' నవల ఆవిష్కరణ



తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర పోరాట చరిత్రకు సంబంధించిన సూక్ష్మ విషయ పరిజ్ఞానమే ఈ నవల సారాంశమని 'చూపు నవల' రచయిత డా. బి.ఎస్.రాములు అన్నారు. హైదరాబాద్‌లో డిసెంబరు 22న ఇందిరాపార్కు వద్దగల ఎన్టీఆర్ స్టేడియంలో బుక్‌ఫెయిర్ ఆధ్వర్యంలో 'చూపు' నవల పుస్తకావిష్కరణ కార్యక్రమం నిర్వహించారు. పత్రికా సంపాదకులు టంకశాల అశోక్ ఈ పుస్తకాన్ని ఆవిష్కరించారు. ఈ సందర్భంగా నవల రచయిత బి.ఎస్. రాములు మాట్లాడుతూ... ఈ నవలలో 15 పాత్రలు ఉన్నాయని, ప్రొ. లక్ష్మీపతి పాత్ర, ప్రొ. జయశంకర్ జీవితాన్ని పోలి ఉంటుందని ఆయన తెలిపారు. ఉద్యోగాలు దొరకక, బయటికి పోలేక ఉస్మానియా యూనివర్శిటీలోనే రెండు, మూడు పీజీలు చేస్తున్న విద్యార్థుల పరిస్థితులను నవలలో పొందుపర్చానన్నారు. సమస్త వర్ణ, వర్గ, కుల, మత, లింగాల అంశాలు, పరిణామాలు ఉన్నాయని ఆయన పేర్కొన్నారు. స్త్రీ ఆవేదన, రోదన, గొప్పతనం ఈ నవలలో చిత్రించానని చెప్పారు. బి.ఎస్. రాములు రచనలు అద్భుతంగా ఉంటాయనీ, చదివే వారికి తన శైలీ ఆలోచింపజేసేవిధంగా ఉంటుందని గోరటి వెంకన్న అన్నారు. రచయితలు కె.బి.గోపాలం, బైస దేవదాస్, డా. వింజమూరి ప్రకాష్, హిప్నో కమలాకర్, జూలూరి గౌరీశంకర్ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## నిత్య సాహిత్య కృషీవలుడు



నిత్య సాహిత్య కృషీవలుడు ఆచార్య రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి అని ఎస్సీ, ఎస్టీ,సెల్ డి.ఎస్.పి కవి, రచయిత అయిన లోసారి సుధాకర్ అన్నారు. రాచపాళెంకు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు వచ్చిన సందర్భంగా డిసెంబరు 21న కడపలో ఆయనను కలిసి అభినందించారు. ఈ సందర్భంగా సుధాకర్ మాట్లాడుతూ గత నాలుగు దశాబ్దాలుగా రాచపాళెం తెలుగు భాషా, సాహిత్యానికి ముఖ్యంగా నవలలు, కథానికలపై సద్విమర్శలు చేసి తెలుగు సాహిత్య అభ్యున్నతికి, పురోగతికి ఎంతగానో తోడ్పాటు అందించారన్నారు. సాహితీ ప్రవంతి జిల్లా కన్వీనర్ ఎస్.మస్తాన్‌వలి మాట్లాడుతూ రాచపాళెంకు కేంద్ర సాహిత్య అకాడమి అవార్డు రావడం తెలుగు ప్రజలు ముఖ్యంగా రాయలసీమ సాహిత్య అభిమానులకు ఆనందదాయకమన్నారు. రాచపాళెంను కలిసి అభినందించిన వారిలో లోసారి సుధాకర్, ఎస్.మస్తాన్‌వలి, కర్నూలు సాహితీ ప్రవంతి జిల్లా ప్రధాన కార్యదర్శి కెంగారపు మోహన్, రఘులు ఉన్నారు.



జనవిజ్ఞాన వేదిక ఆధ్వర్యంలో డిసెంబర్ 7న జరిగిన డా॥ ఎం.ఎం.వినోదిని పుస్తకం 'వేగు చుక్కలు' ఆవిష్కరణ సభ. కడపలోని సిపి. బ్రౌన్ గ్రంథాలయంలో జరిగిన ఈ సభలో కేతు విశ్వనాథ్‌రెడ్డి, రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి, స.వెం.రమేష్, ఎ.రఘునాథ్‌రెడ్డి, మల్లెమాల వేణుగోపాల్‌రెడ్డి, పుత్తా బాలరెడ్డి తదితరులు పాల్గొన్నారు.



"శిలపర శెట్టి రాములు నాయుడు స్మారక పురస్కారం "2014 గాను సడ్లపల్లె చిదంబరరెడ్డి "దృశ్యప్రవాహం" కవితా సంపుటి ఎన్నికయింది. నవంబరు 16న అనకాపల్లెలో జరిగిన సాహిత్య సభలో పురస్కారం అందిస్తున్న శ్రీమతి జగద్ధాత్రి, రామతీర్థ, మాధవీసనారా తదితరులు.




నవంబర్ 30న ఒంగోలులోని రంగాభవన్‌లో కేంద్రసాహిత్య అకాడమీ మరియు ప్రకాశం జిల్లా రచయితల సంఘం సంయుక్త ఆధ్వర్యంలో జరిగిన "తెలుగు సాహిత్యం - ప్రస్తుత పరిణామాలు" సదస్సులో ప్రసంగిస్తున్న అకాడమీ తెలుగు సలహామండలి సంచాలకులు ప్రొ. యన్.గోపి. చిత్రంలో అకాడమీ కార్యక్రమ అధికారి కె.పి.రాధాకృష్ణన్ ప్రకాశం జిల్లా రచయితల సంఘం అధ్యక్షుడు బి. హనుమారెడ్డి, డా॥యు.దేవపాలన ఉన్నారు.

# దాసరి వెంకట రమణకు బాలసాహిత్యంలో 2014 కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు



బాలసాహిత్యంలో తెలుగు విభాగంలో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు అందుకుంటున్న దాసరి వెంకటరమణ.

2014 సంవత్సరానికి గాను బాల సాహిత్యంలో కేంద్ర సాహిత్య అకాడెమి అవార్డుల ప్రధానోత్సవం బెంగుళూరులోని కువెంపు కళాక్షేత్రంలో నవంబరు 14న జరిగింది. ఈ కార్యక్రమానికి సాహిత్య అకాడమీ కార్యదర్శి కె. శ్రీనివాసరావు స్వాగతం పలికారు. ప్రముఖ కన్నడ రచయిత, శతాధిక వృద్ధుడు గంజాం వెంకట సుబ్బయ్య ముఖ్య అతిథిగా విచ్చేశారు. సాహిత్య అకాడమి వైస్ ప్రెసిడెంట్, ప్రముఖ కన్నడకవి, నాటక కర్త, జ్ఞానపీఠ పురస్కార గ్రహీత చంద్రశేఖర కంబార చేతుల మీదుగా అవార్డుల ప్రధానం జరిగింది. ఈ అవార్డును తెలుగులో దాసరి వెంకటరమణ తాను రాసిన ఆనందం అనే కథల పుస్తకానికి అందుకున్నారు. తెలంగాణా ప్రభుత్వం రిజిస్ట్రేషన్ & స్టాంపుల శాఖలో సబ్-రిజిస్ట్రార్‌గా పనిచేస్తున్న దాసరి వెంకటరమణ ఇప్పటి వరకు వివిధ వార, మాస పత్రికలలో దాదాపు 400 వరకు రచనలు చేశారు. గతంలో తన అమ్మమనసు పుస్తకానికి గాను పొట్టి శ్రీరాములు తెలుగు యూనివర్సిటీ ఉత్తమ బాల సాహిత్య పురస్కారం (2006), చక్రపాణి-కొలసాని పురస్కారం (2008), శ్రీమతి నన్నపనేని మంగాదేవి ఉత్తమ బాలసాహిత్య పురస్కారం (2010) అందుకున్నారు. కథ, మాటలు, పాటలు అందించిన మహాకవి భారవి టీవీ సీరియల్ (1998) ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నుండి నాలుగు నంది అవార్డులు కైవసం చేసుకుంది. కథ, మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వహించిన అద్దంలో చందమామ సినిమా తెలుగు యూనివర్సిటీ లఘు చిత్రాల పోటీలో రెండవ ఉత్తమ చిత్రంగా అవార్డు పొంది, రూ. 20,000/-ల నగదు బహుమతి గెలుచుకుంది. కేంద్ర సాహిత్య అకాడమి అవార్డు రావటం పట్ల దాసరి వెంకటరమణ హర్షం ప్రకటించారు. ఈ అవార్డు బాలసాహిత్యంలో మరింత కృషి చేయాలనే బాధ్యతను పెంచింది అని తెలిపారు.

## కొలకలూరి పురస్కారాలకు ఆహ్వానం

**శ్రీమతి కొలకలూరి విశ్రాంతమ్మ పురస్కారం** ఈ సంవత్సరం నాటకం/ నాటికా సంపుటికి ప్రధానం చేయడం జరుగుతుందని ఆచార్య కొలకలూరి ఆశాజ్యోతి ఒక ప్రకటనలో తెలిపారు. కడచిన మూడు సంవత్సరాలలో అంటే జనవరి 2012 నుంచి డిసెంబర్ 2014 వరకు ముద్రితమైన నాటకం/ నాటికా సంపుటులు పురస్కారానికి పరిశీలింపబడతాయని ఇందుకోసం రచయితలుగానీ, ప్రచురణకర్తలు గానీ మూడేసి ప్రతులు పరిశీలనార్థం పంపవలసిందిగా కోరారు. ఒకే రచయితవి ఒకటి కంటే ఎక్కువ నాటకాలు/నాటికా సంపుటులు ఎన్నయినా పంపవచ్చునని తెలిపారు. పురస్కారంగా రూ. 10,000/-నగదు, శాలువ, మెమెంటో ప్రదానం చేస్తామని, నాటకం / నాటికా సంపుటిలోగా పంపవలసిందిగా కోరారు. 15-2-2015న పురస్కార ప్రకటన జరుగుతుందని, 26-2-2015న హైదరాబాద్‌లో జరిగే సభలో పురస్కారం ప్రధానం చేస్తామని తెలిపారు. **నాటకం / నాటికా సంపుటులు పంపవలసిన చిరునామా:** ఆచార్య కొలకలూరి ఆశాజ్యోతి, ఆంధ్రాచార్యులు, తెలుగు శాఖాధ్యక్షులు, బెంగుళూరు విశ్వవిద్యాలయం, జ్ఞానభారతి, బెంగుళూరు-560 056.

**శ్రీమతి కొలకలూరి భాగీరథీ పురస్కారం** ఈ సంవత్సరం కవితా సంకలనానికి (వచన, గేయ, పద్య, కవితా సంకలనాలు) ప్రదానం చేయడం జరుగుతుందని ఆచార్య కొలకలూరి మధుజ్యోతి ఒక ప్రకటనలో తెలిపారు. కడచిన మూడు సంవత్సరాలలో అంటే జనవరి 2012 నుంచి డిసెంబర్ 2014 వరకు ముద్రితమైన కవితా సంకలనం (ఒక్క రచయిత కవితలే) ఈ పురస్కారానికి పరిశీలింపబడతాయని, పురస్కారం రచయితకు మాత్రమే ఇవ్వడం జరుగుతుందని ఇందుకోసం రచయితలుగానీ, ప్రచురణకర్తలు గానీ మూడేసి ప్రతులు పరిశీలనార్థం పంపవలసిందిగా కోరారు. ఒకటి కంటే ఎక్కువ సంకలనాలైనా పంపవచ్చు. పురస్కారంగా రూ. 10,000/- నగదు, శాలువ, మెమెంటో ప్రదానం చేస్తామని, కవితా సంకలనాలు 15-1-2015లోగా పంపగోరుతున్నాము. 15-2-2015న పురస్కార ప్రకటన జరుగుతుందని. 26-2-2015న హైదరాబాద్‌లో జరిగే సభలో పురస్కారం ప్రదానం చేస్తామని తెలిపారు. కవితా సంకలనాలు పంపవలసిన చిరునామా : ఆచార్య కొలకలూరి మధుజ్యోతి, ఆంధ్రాచార్యులు, తెలుగుశాఖ, శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం, తిరుపతి- 517 502.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

# చాగంటి సోమయాజులు

## 17.01.1915 - 02.01.1994



తెలుగు సాహిత్యంలో 'చాసో'గా ప్రసిద్ధులు. బొందు మల్లెలు, కుంకుడాకు, ఎంపు వంటి కథలు ప్రాచుర్యం పొందాయి. కొన్ని కథలు మాత్రమే రాసినా అవి కథా లక్షణాలకు నమూనాగా ఉంటాయని చెబుతారు. అభ్యుదయ రచయితల సంఘం ఏర్పాటులో ప్రముఖ పాత్ర పోషించారు.

